

చందమామ విజయా
కంబైన్స్

నాగిరెడ్డి - చక్రపాణి
ఆశీస్సులతో

# బృందావనం

సింగీతం శ్రీనివాసరావు

డి.వి.నరసరాజు

నిర్మాత
బి.వెంకట్రామరెడ్డి

మాధవపెద్ది సురేష్






'మేగీ జిగ్సా పజిల్'లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.

మేఘాలలో తేలిపోండి! 'మేగీ స్కై ఫ్లైజర్'లో





మేగీ 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకూ
యాత్రను పూర్తి చేయండి.

మేగీ 'హూ-డున్-ఇట్ మిస్టరీ'
గేమ్‌లో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

## మేగీ క్లబ్ సదస్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగీ
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేమ్‌లో



ఉచిత మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్ ఉచితం.



ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస
ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు ముందు వైపున ఉండే ఈ [logo]ను కత్తిరించి మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి. అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో వినోదాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా, మీరు పుట్టిన తేదీని పంపండి. ఈపరికే మీరు మేగీ క్లబ్ సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిదే సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.

మా చిరునామా:

**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




మరొక సదుపాయం కూడా! ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనట్లయితే ఇప్పుడే సేకరించండి!

HTA 7778TEL




# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి సంచాలకుడు : చక్రపాణి

## ఆనందాన్ని పంచుకుందాం!

క్రిస్మస్ పండుగ సందర్భంగా ప్రపంచమంతటా ప్రజలు బంధుమిత్రులకు తమ క్రిస్మస్ శుభాకాంక్షలు తెలియజేసుకుంటారు. ఈ సమయంలో ఆనంద క్రిస్మస్ శుభాకాంక్షలతోపాటు, సుఖసంతోషాలు తీసుకురావాలనే నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేసే అందమైన లేఖలతో తపాలాకార్యాల యాలు నిండిపోతాయి!

అసలు శుభాకాంక్షలు తెలియజేసే ఈ అలవాటు ఎలా ఆరంభ మయింది? తాను పొందే ఆనందాన్ని, అనుభవించే సుఖసంతోషాలను పదిమందితో కలిసి పంచుకోవాలను కోవడం మానవ స్వభావం. మనం నవ్వే చిరునవ్వయినా ఎదుటి వాళ్ళకు తెలుస్తుంది. వాళ్ళూ నవ్వి తమ ఆనందాన్ని వ్యక్తం చేయకుండా ఉండలేరు. ఓర్వలేనిగుణం ఉన్నవాళ్ళు తప్ప, మిగతా అందరూ ఎదుటి వాళ్ళు సంతోషంగా ఉంటే చూసి ఆనందిస్తారు.

ఓర్వలేనిగుణం మనిషికి దుఃఖం కలిగిస్తుంది. కాబట్టి దానిని దగ్గరికి రానీయకూడదు. మనసులో, మాటలలో, చేతలలో ఎదుటి వాళ్లకు హాని తలపెట్టకుండా, బాధలలో ఉన్న వాళ్ళను ఆదుకుంటూ, మంచి పనులు చేసే వాళ్ళను మెచ్చుకునే ఆరోగ్యకరమైన మనస్తత్వాన్ని పెంపొందించు కోవాలి. అప్పుడే అందరూ ఆనందంగా సుఖశాంతులతో జీవించడం సాధ్య మవుతుంది. మనుషుల మధ్య సమానత్వం ఉన్నప్పుడే ఈ సుఖ శాంతులు కలకాలం వర్ధిల్లుతాయి. కాబట్టి కేవలం పండుగలూ పర్వాల సందర్భంలో మాత్రమే కాదు; సర్వవేళలా మానవులందరూ సుఖశాంతులతో తులతూగా లన్న ఆకాంక్ష మన అందరి హృదయాలలోనూ ఉండాలి. అందుకోసం ప్రతి ఒక్కరూ కృషి చేయాలి!

సంపుటి 90 డిసెంబరు '92 సంచిక : 6

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00

CHITRA

# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.

ఇది నాకు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.






# నోబెల్ శాంతి బహుమతి



ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి కూడా ఒక స్త్రీకే లభించింది. గత సంవత్సరం మియాన్మార్ (బర్మా)కు చెందిన శ్రీమతి ఆంగ్‌సాన్ సూకీకి లభించింది. ఈయేడు, స్వదేశాన్ని వదిలి మెక్సికోలో ప్రవాస జీవితం గడుపుతూన్న గ్వాటెమాల వీరాంగన కుమారి రిగోబెర్టా మెంచూకు లభించింది.

ఆమెను గురించిన ప్రశంసాపత్రంలో, "స్వదేశంలోనూ, అమెరికా ఖండంలోనూ, ప్రపంచంలోనూ విభిన్న జాతుల మధ్య, సంస్కృతులమధ్య, సమాజాల మధ్య నెల కొన్న భేదాలనూ, ఘర్షణలనూ తొలగించి, శాంతి సామరస్యాలను ఏర్పరచే అద్భుత శక్తికి ప్రతీకగా ఆమె ఉంటున్నది," అని నోబెల్ అవార్డు కమిటీ పేర్కొన్నది.

ముప్పై మూడు సంవత్సరాల క్రితం, మెంచు ఒక పేద కుటుంబంలో జన్మించింది. గ్వాటెమాలాలో గత మూడు దశాబ్దాలుగా సాగుతూన్న అంతర్యుద్ధంలో ఛిన్నాభిన్నమైపోయిన కుటుంబం వాళ్ళది. పలు మధ్య, దక్షిణ అమెరికా దేశాలలాగే, గ్వాటెమాలా కూడా యూరపు దేశాల నుంచి వచ్చి స్థిరపడిన వారికీ–అంతకు పూర్వం నుంచే అక్కడ ఉన్న స్వదేశీయులైనరెడ్ ఇండియన్లకూ మధ్య ఏర్పడిన ఉద్రిక్తతనూ, ఘర్షణలనూ అనుభవిస్తున్నది. 1970-80 సంవత్సరాలలో అక్కడి స్థానికులను దారుణంగా అణచివేయడంజరిగింది.ధనికులైన భూస్వాములూ,సైనికులూ జరిపిన దారుణమైన ఊచకోతలో మెంచు తన తల్లితండ్రులనూ, ఒక సోదరుణ్ణీ కోల్పోయింది. అప్పుడామె వయసు ఇరవై ఏళ్ళు మాత్రమే. అయితే, ఆ క్షణంనుంచి ఆమె, తన ప్రజల హక్కుల కోసం పోరాడడానికి పూనుకున్నది. గ్వాటెమాలా సైనికులతో పోరాడవలసి రావడంతో ఆమె గెరిల్లా యుద్ధ

పద్ధతులను చేపట్టవలసివచ్చింది. ఆనాటికే భద్రతాదళాలు 50,000 మంది గ్వాటెమలా స్వదేశీయులను హతమార్చింది. వాళ్ళలో అధిక సంఖ్యాకులు రెడ్ ఇండియన్లు, ముప్ఫై సంవత్సరాలుగా నడుస్తూన్న పోరాటంలో ఇప్పటివరకు దాదాపు 1,20,000 మందిప్రాణాలు కోల్పోయారు.

మెంచురాజకీయకార్యకలాపాలు హింసాత్మకమైనవి కావు అని చెప్పలేకపోయినప్పటికీ, ఆమె సిద్ధాంతాలు మాత్రం శాంతి సామరస్యాలకూ, సహజీవనానికీ, దోహదం చేసేవనడంలో సందేహం లేదు. ఆమె సాగిస్తూన్నపోరాటం, చేస్తూన్న కృషి మానవ హక్కుల పరిరక్షణకూ, అభివృద్ధికీ ఎంతో దోహదం చేస్తున్నవి.

ఈ విషయంగా నోబెల్ అవార్డు కమిటీ ప్రతినిధి ఒకరు ఇలా అన్నారు: "అమెరికాలోనూ, ప్రపంచవ్యాప్తంగానూ ఉన్న స్వదేశీ ప్రజల సమస్యల నరైన అవగాహనకు, మెంచూకు ఇచ్చిన ఈ శాంతిబహుమతి దోహదంచేయగలదని విశ్వసిస్తున్నాము."

ఐరోపా నావికుడు క్రిష్టఫర్ కొలంబస్ అమెరికా ఖండంలో అడుగుపెట్టి 500 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా అమెరికా ఖండంలో ఘనంగా ఉత్సవాలు జరుపుకుంటున్న ఈ సందర్భంలో, మెంచూకు నోబెల్‌శాంతిబహుమతి లభించడం గమనించతగ్గ విశేషం.

తనకు నోబెల్ బహుమతి లభించిందన్న వార్త తెలిసినప్పుడు మెంచు, "పోరాటంలో తమ జీవితాలనూ, ప్రాణాలనూ అర్పించిన వారి గొంతుకలు న్యాయంకోసం ఘోషిస్తున్నాయి. అంతా అయిపోయిందన్న నిస్పృహతో గత కాలంలో జీవించవలసిన అవసరం లేదు. చరిత్రలో నూతన అధ్యాయాలు రాయడానికికావలసిన చాలా పుటలు మన ముందు ఉన్నాయి" అన్నారు ఎంతో విశ్వాసంతో.

1992 వ సం॥ ఇతర నోబెల్ బహుమతీ గ్రహీతలు: ఫ్రాన్స్‌కు చెందిన ప్రొఫెసర్ జార్జస్ చార్పాక్ (భౌతిక శాస్త్రం); అమెరికాకు చెందిన ప్రొ॥రుడోల్ఫ్ ఎ.మార్కస్ (రసాయనిక శాస్త్రం); అమెరికాకు చెందిన ప్రొఫెసర్ ఎడ్మండ్ ఫిషర్, డా॥ ఎడ్విన్ క్రెబ్స్ (వైద్యశాస్త్రం) ప్రొ. గ్యారీ ఎఫ్.బెకర్ (అర్థికశాస్త్రం) వెస్టిండీస్‌కు చెందిన వాల్కాట్ (సాహిత్యం).



# కురూపిరాకుమారి

రాజుపాలెం అనే ఒక కుగ్రామంలో వుండే పార్థుడనే యువకుడికి, ఇక ఆ గ్రామంలో వుండాలనిపించలేదు. తండ్రి చేసిపోయిన అప్పులు తీర్చడానికి, ఉన్న ఒక్కఇల్లూ అమ్మవలసివచ్చింది. వాడు బతుకుతెరువు కోసం, ఒకనాటి సూర్యోదయంవేళ, ఆ గ్రామంవదలి, రాజధానినగరానికి ప్రయాణ మయ్యాడు.

మధ్యాన్నానికల్లావాడు అడవిమధ్యవున్న చింతలదిబ్బప్రాంతంచేరాడు. అక్కడ దిబ్బ మీద గుడిసె ఒకటి వున్నది. మంచినీళ్ళ కోసం వాడు ఆ గుడిసెను సమీపించాడు. ఆ గుడిసె మంత్రాల మరిడమ్మది. పాతి కేళ్ళుగా, ఆమె ఆ గుడిసెలో ఒంటరిగా నివసిస్తున్నది.

పార్థుడు నాలుగుసార్లు గట్టిగా కేకవేసి పిలిచాక, మంత్రాలమరిడమ్మ, గుడిసె తలుపులు తీసి బయటకు వస్తూ, "ఎవడ్రా వాడు? ఏమా ధైర్యం? నా అంతదాన్ని, అలా కేకవేసి పిలవడమే, ఆ!" అన్నది కోపంగా.

మరిడమ్మ నుదుటి మీద పెద్ద ఎర్రని బొట్టు, మెడనిండా రకరకాల పూసల దండలు, జడలుకట్టిన రాగిరంగు జుట్టు, పిల్లికళ్ళు, తీవ్రమైన కంఠస్వరం — ఇవన్నీ చూసి కాస్త భయపడ్డాడు పార్థుడు.

అయితే, వాడు తనని తాను సర్దుకుని, "మాంచి ఎండనపడివచ్చాను.కాసిని మంచి నీళ్ళిచ్చి పుణ్యంకట్టుకో అత్తా!" అన్నాడు.

అదివిని మరిడమ్మ, "వరసలు కలిపే వాళ్ళంటే, నాకు చచ్చేంత చిరాకురా,అబ్బి! సరే,నీళ్ళేంఖర్మ! ఏకంగా కోడికూర, రొట్టెలు తిని కాస్సేపు నడుం వాల్చి చల్లపడ్డాక వెళు దువు గాని, లోపలికి రా!" అంటూ గుడిసె లోకి దారితీసింది.

అక్కడ మరిడమ్మ పెద్ద విస్తటిలో వడ్డించిన కోడి కూరా, రొట్టెలూ తింటూ

మాచిరాజు కామేశ్వరరావు



పార్థుడు, "అద్భుతమైనకూర; అమోఘమైన రొట్టెలు! నిజంగానే నీచేతిలో ఏదో మంత్రం వుంది అత్తా!" అన్నాడు.

ఆ మాటలకు మరిడమ్మ పొంగి పోయింది. సాయంత్రం పార్థుడు నగరానికి బయలుదేరబోతూండగా సంగతి తెలుసు కున్న, మరిడమ్మ, "అక్కడ నీకు తెలిసిన వాళ్ళెవరైనా వున్నారా? నీ దగ్గిర డబ్బేమైనా ఉన్నదా?" అని అడిగింది.

రెంటికీలేదన్నట్టుతలవూపాడు పార్థుడు. మరిడెమ్మ పెద్దగానవ్వి, "చూడబోతే నువ్వు సత్తెకాలపుసత్తెయ్యలా వున్నావు. ఆ మాయ దారి పట్నంలో నువ్వు నెగ్గుకు రాలేవురా," అన్నది.

ఏమనాలో తెలీక పార్థుడు మౌనంగా వూరుకున్నాడు. మరిడమ్మ ఆప్యాయంగా, "ఏ మాట కామాటే చెప్పుకోవాలిరా అబ్బీ! ఏ చక్రవర్తికీ లేని కళవుంది, నీముఖంలో. ఆ తలకాయ మీదకి కిరీటం ఒక్కటే తక్కువ!" అన్నది.

"రూపం ఇచ్చిన బ్రహ్మ నుదుటి మీద మంచి రాత రాయలేదు, నన్నేం చెయ్య మంటావు?" అన్నాడు పార్థుడు.

మరిడమ్మ ఒక క్షణం ఆలోచిస్తూ వూరు కుని, "సరే, నాలుగు రోజుల పాటు నా దగ్గరవుండు. అత్త అంటూ వరస కలిపావు. నీ తలరాత సరిచేస్తాను. మన రాకుమారిని నీకిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నది.

"వేళాకోళం ఆడడానికి, నీకెవరూ దొరక లేదా, అత్తా? నువ్వు వుండమంటున్నావు గనక, అలాగే వుంటాను. రాజును చేస్తా నంటూ ఆశ పెట్టనవసరం లేదు," అన్నాడు పార్థుడు.

మరిడమ్మకు రాకుమారి మీద చాలా అభిమానం. మహారాణి నిండు చూలాలుగా వున్నప్పుడు, మహారాజుతో కలిసి వన విహారా నికి వచ్చింది. ఆ సాయంత్రం వాళ్ళు తిరిగి పోతూ, మరిడమ్మ వుండే చింతలదిబ్బ ప్రాంతానికి వచ్చారు. ఆ సమయంలో ఒక చిరుతపులి చెట్టు మీదినుంచి రాజున్న రథం మీదికి దూకింది. రాజయితే, ఆ

చిరుతను చంపాడు గాని, రాణీ భయంతో కంపించి పోవడంతో పురిటినొప్పులు ప్రారంభమయ్యాయి. మరిడమ్మ, ఆమెను గుడిసెలోకి తీసుకుపోయి పురుడుపోసింది. రాణీ ఒక కురూపి ఆడపిల్లను కని, బిడ్డను కళ్ళ చూడకుండానే కన్ను మూసింది.

రాజుగారు, ఆ కురూపి తన బిడ్డగా నలుగురికీ చూపించడం ఇష్టంలేక, అంతః పురంలోని ఒక రహస్యమందిరంలో వుంచి, బయటి ప్రపంచం తెలియకుండా పెంచాడు. ఆ కురూపిరాకుమారి ఇప్పుడు యుక్తవయస్కురాలయి, రాజు గారికి ఆమె వివాహం గడ్డు సమస్యగా తయారయింది.

పురుడుపోసినఅభిమానంతో, మరిడమ్మ అప్పుడప్పుడూ రాజభవనానికి వెళ్ళి, రాకుమారిని పలకరించి వస్తూంటుంది.

మర్నాడు తెల్లవారుతూనే మరిడమ్మ, పంజరంలో వున్న ఒక రామచిలకను తీసుకుని రాజుగారి దగ్గిరకు వెళ్ళింది. రాజామెను చూసి, "ఏం, మరిడమ్మా! చిలకను వెంట తెచ్చావేం?" అని అడిగాడు.

"నేను లోగడ వచ్చినప్పుడు, రాకుమారి చిలక కావాలన్నది, మహారాజా!" అంటూ బొంకేసింది మరిడమ్మ.

రాకుమారి పంజరంలో వున్న చిలకను చూసి మురిసిపోతూ, "దీనికోసం బంగారు పంజరం చేయిస్తానవ్వా!" అన్నది.



"హాయిగా అడవుల్లోనూ, పళ్ళతోటల్లోనూ తిరిగే రామచిలక, నువ్వు బంగారు పంజరంలో బంధిస్తే సుఖంగా వుండగలదా?" అన్నది మరిడమ్మ.

"అడవులూ,తోటలూ ఎక్కడ వుంటాయి? ఎలా వుంటాయి?" అని కుతూహలంగా అడిగింది రాకుమారి.

"అవన్నీ నాతో పాటు వస్తే చూపిస్తాను. అక్కడ ఎవరడిగినా, నువ్వు నా మనమరాలివని చెప్పాలి. నిన్నిలా తీసుకెళితే, మీ నాన్న నా తల నరికి కోట గుమ్మానికి వేలాడదీస్తాడు. నిన్ను చిలకగా మార్చి నావెంట తీసుకు వెళతాను, సరేనా?" అన్నది మరిడమ్మ.



"అత్తయ్యా! నువ్వు గుడిసెలోంచి అటు వెళ్ళగానే, నేనిక్కడ గుడ్డివాడినైపోయాను!" అంటూ భోరుమన్నాడు పార్థుడు.

మరిడమ్మ వాడి భుజం తట్టి, "దిగులు పడకు! నీకు తప్పక చూపొస్తుంది. ఇదుగో, నా మనమరాలిని వెంట తెచ్చాను. దానికి వైద్యం తెలుసు. త్వరలో నీకు చూపొచ్చేలా చేస్తుంది," అన్నది.

మరిడమ్మ ఏదో మంత్రం చదివి రామ చిలకను రాకుమారిగా మార్చి, ఒక చిన్న పాత్రలో ఏదో పసరు ఇచ్చి, "మా వాడి కళ్ళకు, ఈ పసరు రాయి. నాకవతల పను లున్నవి," అంటూ గుడిసెలోకి వెళ్ళి పోయింది.

రాకుమారి సంతోషంగా అందుకు ఒప్పు కున్నది. మరిడమ్మ ఏదో మంత్రం చదవ గానే రాకుమారి కాస్తా చిలకగా మారి పోయింది. మరిడమ్మ పంజరంలోని చిల కను గవాక్షంగుండా వదిలిపెట్టి, చిలకగా మారిన రాకుమారిని పంజరంలో పెట్టుకుని తిరుగు ప్రయాణమైంది.

ఆమె గుడిసె చేరే సరికి సాయంత్రం కావస్తున్నది. బయట నులక మంచం మీదపడుకుని వున్న పార్థుడు, మరిడమ్మ వచ్చిన అలికిడికి, "ఎవరు?" అన్నాడు.

"నేనేరా అల్లుడూ! ఏం చూపొచ్చిందా లేదా?" అన్నది మరిడమ్మ చిన్నగా నవ్వు కుంటూ.

పార్థుణ్ణి చూస్తూనే రాకుమారి చాలా ఆశ్చర్యపోయింది. సృష్టిలో అంత అంద మైన వాళ్ళుంటారని ఆమె ఏనాడూ ఊహించలేదు. అయితే, అంత అంద గాడికి చూపు లేకపోవడం, ఆమెను ఎంత గానో బాధించింది.

రాకుమారి, మరిడమ్మ ఇచ్చిన ఆకు పసరు కళ్ళకు పూస్తూంటే, పార్థుడు, "ఎవరు నువ్వు?" అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"మరిడమ్మ మనమరాల్ని. నేను రాసే మందుకు కళ్ళేమైనా మండుతున్నాయా?" అని ఆప్యాయంగా అడిగింది రాకుమారి.



"అదేంలేదు!" అన్నాడు పార్థుడు చిన్నగా నవ్వుతూ.

మరిడమ్మ, రాకుమారికి రామచిలకగా మారడం, తిరిగి మామూలు రాకుమారిగా మారడం ఎలాగో ఆ మంత్రం నేర్పింది. రాకుమారి చీకటిపడే సమయానికి, చిలకగా మారి తన అంతఃపురానికి ఎగిరి పోయింది.

మర్నాడు మధ్యాహ్నం వేళకు రాకుమారి వచ్చింది. వస్తూనే ఆమె పార్థుడికి పసరు రాసింది. ఈ విధంగా పదిరోజులు జరిగింది. తనకు వైద్యం చేస్తున్న, మరిడమ్మ మనమరాలు తన పక్కన లేకుండా, జీవించలేనేమో నన్న భయం పట్టుకున్నది, పార్థుడికి.

ఒకరోజు రాత్రి వాడు, మరిడమ్మతో, "అత్తా, కంటిచూపు తిరిగివస్తే, ఆ చలవ నీ మనమరాలిదే. ఆమెకు అభ్యంతరం లేకపోతే పెళ్ళి చేసుకుంటాను," అన్నాడు.

"అదేమిట్రా, అబ్బీ! నీకు రాకుమారితో పెళ్ళి జరపాలనుకుంటున్నాను గదా," అన్నది మరిడమ్మ.

"నాకు ఏ రాకుమారీ అవసరం లేదు. పెళ్ళంటూ చేసుకుంటే నీ మనమరాల్నే చేసుకుంటాను," అన్నాడు పార్థుడు చాలా పట్టుదలగా.

మర్నాడు వచ్చిన రాకుమారితో, మరిడమ్మ పార్థుడన్న మాటలు చెప్పింది.

"అంతటి అందగాడికి, నేను తగను అవ్వా," అన్నది రాకుమారి తలవంచుకుని.

"మావాడికి చూపు రాదనే గదా, నీ భయం!" అన్నది మరిడమ్మ.

అందుకు రాకుమారి కంగారుపడి, "అదేంమాట, అవ్వా? ఆయనకు చూపు లేక పోయినా, నాకుందిగా," అన్నది.

మరిడమ్మ సంతోషంగా, "ఇద్దరికీ ఒకరి మీద ఒకరికి, ఇంత ఇష్టంగా వున్నప్పుడు, ఇంకా దాగుడుమూతలెందుకు? రాజ్యం కోసం గాక, నిన్ను నిన్నుగా ఇష్టపడే వాడి కిచ్చి, నీ పెళ్ళి జరిపించాలని, మీ నాన్నగారి ఆశ! ఇక పార్థుడికి కళ్ళు కనిపిస్తాయిలే," అన్నది.

రాకుమారి ఆనందంగా తన భవనానికి వెళ్ళిపోయింది. మర్నాడు తిరిగి ఆమె రాగానే, మరిడమ్మ, పార్థుడితో, "అల్లుడూ నా మనమరాలొచ్చింది. పెళ్ళిముహూర్తం కూడా పెట్టేశాను. ఒకసారి నీ కాబోయే భార్యనుచూడు," అంటూ మంత్రం చదివి, పార్థుడి కళ్ళను తాకింది.

పార్థుడు కళ్ళు తెరిచి, "ఆహా, నాకు చూపొచ్చింది!" అంటూ మరిడమ్మ పక్కనే వున్న, కురూపిరాకుమారిని చూసి చప్పున తలదించుకున్నాడు.

"నా మనమరాలిరూపం, నీకునచ్చలేదా ఏం?" అని అడిగింది మరిడమ్మ.

"నీ మనమరాలంటే, నాకు పంచ ప్రాణాలు. అయితే ఆమె వికారరూపం..." అంటూ నసిగాడు పార్థుడు.

మరిడమ్మ, ఒక చిన్న అద్దం తెచ్చి పార్థుడికిచ్చింది. పార్థుడు అందులో తన ముఖంచూసుకుని భయంతో కెవ్వుమంటూ అరిచాడు. వాడి రూపం వికృతంగా మారిపోయింది.

"అల్లుడూ! ఇప్పుడు చెప్పు, నా మనమ రాలు నీకు తగిన జోడే గదా?" అంటూ నవ్వింది మరిడమ్మ.

పార్థుడు తలవంచుకుని కొద్దిసేపు ఆలో చించి, "అత్తా, నాలోవున్న మూర్ఖత్వాన్ని పారదోలావు. ఈ పెళ్ళి నేను మనస్ఫూర్తిగా చేసుకుంటాను!" అంటూ మరిడమ్మ అందించిన బంతిపూల దండను కురూపి రాకుమారి మెడలో వేశాడు.

ఆశ్చర్యం! ఆ మరుక్షణం, కురూపి రాకుమారి బంగారు దేహచ్ఛాయతో, అతి లోకసుందరిలా మారిపోయింది. ఆ క్షణమే పార్థుడికి తన పూర్వరూపం వచ్చేసింది.

మరిడమ్మ ద్వారా జరిగినదాని పూర్వా పరాలు విన్న రాజు, రాజ్యం కోసం కాక, కోరి కురూపిగా వున్నప్పుడు తన కుమార్తెను వివాహమాడిన పార్థుణ్ణి ఎంతగానో మెచ్చు కున్నాడు. ఆ తర్వాత కొంత కాలానికి, రాజు కాలధర్మం చెందగా, పార్థుడు రాజై ఎన్నో సంవత్సరాల పాటు ప్రజారంజకంగా రాజ్య పాలన చేశాడు.






9

[యువరాణి విద్యావతిని వెతకడానికి వెళ్ళిన మహేంద్రనాధుడికి అరణ్యమధ్యంలో ఒక భవనం కనిపించింది. ఆ భవన ద్వారపాలకుడితో అతనికి స్నేహం ఏర్పడింది. మర్నాడు అక్కడి సేవకులలో ఒకడుగా వెళ్ళి మహేంద్రనాధుడు భవనం లోపలి గదులను చూసి వచ్చాడు. అతడు భవనం అవతలివైపు ద్వారంవద్ద కాపలాదారుగా చేరాడు.—తరవాత]

"విద్యావతి కనిపించకుండాపోయి, ఒక వారం గడిచి పోయింది. ఇంతవరకూ ఆమె ఎక్కడ ఉన్నదీ తెలియలేదు!" అన్నది రాణి వజ్రేశ్వరీదేవి రాజుతో పట్టరాని దుఃఖంతో.

వీరసేన మహారాజు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. కొంతసేపు మౌనం వహించి, ఆతరవాత ఆయన, "విద్యావతిని వెతకడానికి నలుదిశలకూ మన భటులను పంపాము. వాళ్ళల్లో ఇంకా కొంతమంది తిరిగి రాలేదు. మనరాజ్య పౌరులు కూడా కొందరు యువరాణిని వెతకడానికివెళ్ళారు. త్వరలో శుభవార్త అందగలదు. విచారించకుదేవీ," అన్నాడు ఆమెను నెమ్మదిగా ఓదార్చుతూ.

"విద్యావతిని వెతకడానికి మీ అనుమతి కోసం ఒక యువకుడు వచ్చాడని చెప్పారు కదా? అతడు ఏమయ్యాడు?" అని అడిగింది రాణి.



"ఆ... అవును, మహేంద్రనాథుడుకూడా ఇంకా రాలేదు. దృఢసంకల్పంతో వెళ్ళిన ఆ సాహసయువకుడు, తప్పకుండా మన విద్యావతి జాడను కనుగొని రాగలడన్న నమ్మకంనాకున్నది!" అన్నాడు రాజు ఎంతో విశ్వాసంతో.

"విద్యావతిని వేరొక దూరరాజ్యానికి అపహరించుకుని వెళ్ళారేమో," అని తన అనుమానాన్ని వెలిబుచ్చింది రాణి.

"ఆ అనుమానంతోనే నీ సోదరుడు ఉగ్రసేనుడు, పొరుగు రాజ్యాలలోని మన వేగులకు ఈ విషయం తెలియబేశాడు. కాబట్టి, నువ్వేమీ భయపడనవసరం లేదు. పైగా, విద్యావతికి గ్రహాల ప్రతికూల దశ కూడా త్వరలో అంతం కానున్నది. ఆమె మనల్ని చేరే సమయం అట్టే దూరంలో లేదు. ధైర్యంగా ఉండు. వాచస్పతాచార్యులను రప్పించి యువరాణి గ్రహస్థితి ఎలా ఉన్నదో తెలుసుకుందాం," అని చెప్పి, రాజు ఒక భటుణ్ణి పిలిచి, ప్రధాన జ్యోతిషాచార్యులు వాచస్పతిని వెంట బెట్టుకుని రమ్మని ఆజ్ఞాపించాడు.

ఆ రోజు సాయంకాలం రాజును చూడడానికి వచ్చిన వాచస్పతాచార్యులు, ఆయనకు నమస్కరించి, "నేను తమ దర్శనానికి బయలుదేరుతూ ఉండగా భటుడు వచ్చాడు. ఇతడు నాశిష్యులలో ముఖ్యుడైన మంజునాధుడు. ఇతడొక వార్త తెచ్చాడు. దానిని తెలియజేయడానికి ఇతణ్ణి కూడా తీసుకు వచ్చాను," అన్నాడు వెంటబెట్టుకుని వచ్చిన యువకుణ్ణి చూపుతూ.

"విద్యావతిని గురించేనా?" అని అడిగింది రాణి ఆతృతగా.

వెంటనే మంజునాధుడు, "ఒక విధంగా యువరాణిని గురించే మహారాణీ! జ్యోతిష శాస్త్రంలో నాకు కలిగిన కొన్ని సందేహాలను తీర్చుకోవడానికి నేను రాజ్యంలోని ప్రముఖ జ్యోతిషపండితులను కలుసుకోవడానికి వెళ్ళాను. అప్పుడు వారు, యువరాణి విద్యావతీదేవి జాతకాన్ని పరిశీలించడానికి వారిని జగత్పతాచార్యుడు ఆహ్వానించినట్టు నాతో



చెప్పారు. జగత్పతిని నేను లోగడ ఒకటి రెండుసార్లు మా గురువుగారి గృహంలో చూశాను. అందువల్ల ఆ సంగతి ఆయనకు తెలియజేయడానికి వెళ్ళాను. అయితే, అక్కడ జగత్పతి జాడలేదు," అన్నాడు.

"యువరాణి జాతకం గురించిన సకల వివరాలూ నేను జగత్పతితో చర్చించాను. యువరాణి కనిపించకుండా పోయిన రోజు నుంచి జగత్పతి నా దగ్గరికి రాకపోవడం; ఇప్పుడు నాకు తెలియకుండా యువరాణి జాతకం గురించి అతడు ఇతర జ్యోతిష పండితులతోచర్చించడం, వింతగాఉన్నది. ఆ విషయం నా నుంచి దాచడం మరీ విడ్డూరంగానూ, అంతుబట్టని విషయం గానూ ఉన్నది!" అన్నాడు వాచస్పతా చార్యులు విచారంగా.

"అయినా, జగత్పతి స్వభావం ఎటు వంటిదో, అతడు నమ్మతగిన వాడో, కాదో మీకే తెలియాలి. ఒకవేళ అతడు మీకు తెలియకుండా ఇతర జ్యోతిష పండితులతో సంప్రదించిన తరవాత, యువరాణి భవిష్య త్తును గురించి ఏదైనా శుభవార్త తీసుకు వస్తాడేమో, వేచి చూద్దాం!" అన్నాడు రాజు.

"ఈనాటి వరకు జగత్పతి నిజాయితీని అనుమానించవలసిన పరిస్థితినాకు ఏర్పడ లేదు. అయితే, ఇప్పుడు అతడు యువ రాణి జాతకం గురించి ఇతర జ్యోతిష పండితులతో చర్చిస్తూ, ఆ విషయాన్ని నానుంచి దాస్తున్నాడంటే అతన్ని అనుమా నించవలసివస్తున్నది. ఇప్పుడతడు ఎక్కడు న్నాడు? ఏం చేస్తున్నాడు? మొదలైన సంగ తులు తెలుసుకోవాలి. సరే, అతని జాడ తెలియగానే నేనే స్వయంగా మీ దగ్గరికి వస్తాను," అని చెప్పి, రాజు దగ్గర సెలవు తీసుకుని, వాచస్పతాచార్యులు శిష్యుడితో సహా అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ తరవాత రాజు, వాచస్పతాచార్యులు చెప్పిన సంగతిని సేనానాయకుడు ఉగ్ర సేనుడితో చెప్పాడు. అంతా విన్న ఉగ్ర సేనుడు, "యువరాణి జాతకంపట్ల జగత్పతి చూపిన అమితమైన ఆసక్తిని గమనించి



నప్పుడే నాకు అతడి ప్రవర్తన పట్ల అను మానం ఏర్పడింది. యువరాణి కనిపించ కుండా పోయిన తరవాత అతడు అంతు లేకపోవడంతో ఆ అనుమానం మరింత ఎక్కువయింది. అతడి నివాసస్థానం, పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడానికి ఎంతో ప్రయత్నించాను. కాని ప్రయోజనం లేక పోయింది. అతడొక విచిత్రమైన వ్యక్తి లాగే ఉన్నాడు. అతడిపట్ల మనమెంతో జాగ్రత్తగా వ్యవహరించాలి!" అన్నాడు.

"సరే, మహేంద్రనాధుడి నుంచి ఏదైనా సమాచారం అందిందా? అతని తల్లి క్షేమంగా ఉన్నది కదా?" అని అడిగాడు రాజు.

"ఆమెకు ఏ కొరతా లేకుండా చూసు కుంటున్నాము. మహేంద్రనాధుడు ఇంకా తిరిగి రాలేదు. ఎటువంటి సమాచారమూ లేదు," అన్నాడు ఉగ్రసేనుడు.

"నాకెందుకోగాని, ఆ యువకుడు తప్ప కుండా విద్యావతి ఎక్కడున్నదో తెలుసు కుని రాగలడన్న నమ్మకం కలుగుతున్నది!" అన్నాడు రాజు.

* * *

రాత్రంతామేలుకుని ఉన్నప్పటికీ మహేంద్ర నాధుడికి అంత కష్టమనిపించ లేదు. ద్వారం వద్ద కొంతసేపు కూర్చున్నాడు. ఆ తరవాత ద్వారానికీ, ఉద్యానవనానికీ మధ్య ఉన్న చిన్న మార్గంకుండా కొంతదూరం ముందుకువెళ్ళి చుట్టుపక్కల పరిసరాలను కలయజూశాడు. భవనం కిందిగదులన్నిటి నుంచీ వెలుతురు కనిపిస్తున్నది. అయితే, పై అంతస్తులో ఒకటి రెండు గదులలో మాత్రమే దీపాలు వెలుగుతున్నవి. కొంత రాత్రి గడిచిన తరవాత, కిందిభాగంలోని గదులలో దీపాలు ఆరిపోయాయి. పై భాగంలోని రెండు గదులలో వెలుతురు చాలాసేపు కనిపించింది. ఆ తరవాత ఆ గదులలోని దీపాలు కూడా ఆరిపోవడం వల్ల అంతటా చిమ్మచీకటి ఆవరించింది.

తెల్లవారుతూ ఉండగా అక్కడికి ద్వార పాలకుడు వచ్చి, మహేంద్రనాధుణ్ణి వెంట

బెట్టుకుని భవనం దక్షిణం వైపుకు తీసుకు పోయాడు. అక్కడొక విశాలమైన భోజనాల గది ఉన్నది. భోజనానికికూర్చున్న మహేంద్ర నాథుడు తల పక్కకి తిప్పి చూశాడు. తెల్ల చీర కట్టుకుని మేలి ముసుగు వేసుకుని ఉన్న ఒక వృద్ధస్త్రీ, వంటగది నుంచి వెలు పలికి రావడం కనిపించింది. ఆమె వెంట ఇద్దరు పరిచారికలు రెండు పళ్ళాల నిండా ఆహార పానీయాలను తీసుకుని వెళు తున్నారు. ఆ ఇద్దరు పరిచారికలు కూడా ఒకేవిధమైన దుస్తులూ, ఆభరణాలూ ధరించి ఉండడం చూసి ఆశ్చర్యం చెందిన మహేంద్రనాథుడు భోజనం ముగించి, విశ్రాంతి తీసుకోవడానికి ద్వారాపాలకుడి గదికి వెళ్ళాడు.

సూర్యుడు పడమర దిశకు వాలుతూ ఉండగా మహేంద్రనాథుడు నిద్రలేచి, తాను కాపలా ఉండవలసిన భవనం అవ తలి ద్వారాన్ని చేరుకున్నాడు.

సూర్యాస్తమయానికి కొంతసేపు ఉన్న ప్పుడు, మహేంద్రనాథుడు తాను కూర్చున్న బండమీదికి ఎక్కి నిలబడి చూశాడు. దూరంలో భవనం మెట్లు కొంత భాగం తప్ప ఏదీ కనిపించలేదు. ఉద్యానవనంలో ఏదో అలికిడి వినిపించడంతో అతడు అటు వైపుకు వెళ్ళాడు. అక్కడ అతనికి ఉదయం భోజనగృహం దగ్గిర కనిపించిన వృద్ధస్త్రీ కనిపించింది. ఆమెకు వెనక కొంత దూరంలో ఒక అందమైన యువతి, ఉద్యాన వనంలోని పువ్వులను సుతారంగా





తాకుతూ, నడుస్తున్నది. మహేంద్రనాధుడు ఉదయం చూసిన పరిచారికలలాగే ఈ యువతి దుస్తులూ, ఆభరణాలూ ధరించి ఉన్నది. అయితే ఈమె అద్భుత సౌందర్య వతి!

మహేంద్రనాధుడు ఏదో పనిలో నిమగ్నుడై ఉన్నవాడిలాగా, ముందుకూ, వెనక్కూ నడుస్తూ ఎవరికీ అనుమానం కలగకుండా వాళ్ళను గమనించసాగాడు. వాళ్ళిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడలేదు. వృద్ధస్త్రీ ఒకచోట కూర్చుని వనవిహారం చేస్తున్న యువతిని జాగ్రత్తగా గమనిస్తున్నది. కొంతసేపయ్యాక, మరొక యువతి ఉద్యానవనంలోకి వచ్చి, వృద్ధస్త్రీతో ఏదో చెప్పింది. వెంటనే వృద్ధస్త్రీ భవనంలోపలికి వెళ్ళింది. వచ్చినయువతి, ఉద్యానవనంలో ఉన్న యువతిని సమీపించింది. వారిద్దరి దుస్తులు కూడా, ఒకేవిధంగా ఒకే రంగులో ఉన్నాయి. మరి కొంతసేపు అక్కడే గడిపి, చీకటి పడుతూ ఉండగా యువతి ఆ సౌందర్యవతిని భవనం లోపలికి తీసుకు వెళ్ళింది. వాళ్ళు వెళ్ళగానే భవనం పైభాగం లోని ఒక గదిలోని దీపాలు వెలిగాయి. అయితే ఆగది నిన్న రాత్రి దీపాలు వెలిగిన గది కాదని మహేంద్రనాధుడు గ్రహించాడు.

ద్వారపాలకుడు చెప్పిన ముఖ్యమైన స్త్రీ ఎవరై ఉంటారా అని ఆలోచిస్తూ, మహేంద్ర నాధుడు ద్వారం దగ్గర కూర్చున్నాడు. ఉద్యానవనంలో చూసిన ఇద్దరు యువతులు కూడా ఒకే విధమైన దుస్తులు ధరించి ఉండడం అతనికి ఆశ్చర్యం కలిగించింది.

ఆ తరవాత చాలాసేపటికి, ఆహారం తీసుకుని వచ్చిన ద్వారపాలకుణ్ణి, "ఈ ప్రాంతం చాలా నిశ్శబ్దంగా ఉన్నది. యజమాని వెళ్ళిపోయాడా ఏం?" అని అడిగాడు మహేంద్రనాధుడు యథాలాపంగా.

"లేదు, లేదు. యజమాని ఇక్కడే ఉన్నాడు. ఆయన రాత్రీ, పగలూ జ్యోతిష్కులతో చర్చలు జరుపుతున్నాడు. కాబట్టి ఇటువైపు రాడు. అయినా, నువ్వు జాగ్రత్తగా

ఉండాలి సుమా!" అని హెచ్చరించాడు ద్వారపాలకుడు.

"నేను ఇక్కడ కాపలా ఉన్నట్టు యజమానికి తెలుసా?" అని అడిగాడు మహేంద్రనాథుడు, చేతులు కడుక్కుని భోజనం చేయడానికి కూర్చుంటూ.

"తెలుసు. నిన్న నేను చెప్పాను. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే ప్రస్తుతం ఈ భవనంలో ఉన్న ముఖ్యమైన స్త్రీ, ఏదో రాజ్యానికి యువరాణి అని చెబుతున్నారు. ఆమె ఇక్కడే మరి కొంతకాలం ఉంటుందట! కాబట్టి నువ్వు మరీ జాగ్రత్తగా ఉండాలి! గుర్తుంచుకో!" అని మళ్ళీ హెచ్చరించాడు ద్వారపాలకుడు.

"ఒకవేళ యజమాని ఇటువైపువచ్చినా రావచ్చు కదా! నేను కంటిమీద రెప్ప వేయకుండా చాలా జాగ్రత్తగా చూసుకుంటాను. ఆ విచారం నీకు వద్దు," అన్నాడు మహేంద్రనాథుడు భోజనం ముగించిలేస్తూ.

"నీ మంచితనం చూసి, నీమీది విశ్వాసంతో, యజమానితో చెప్పి నీకీ ఉద్యోగం ఇప్పించాను. నీ ఉద్యోగధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించి నాపేరు నిలబెట్టగలవని నమ్ముతున్నాను," అన్నాడు ద్వారపాలకుడు.

"నీమేలు మరువరానిది. నీకు ఎప్పుడూ విశ్వాసపాత్రుడుగా ఉంటాను," అన్నాడు మహేంద్రనాథుడు.

ద్వారపాలకుడు అక్కడినుంచి వెళ్ళిపోయాక, మహేంద్రనాథుడు మెల్లగా ఉద్యానవనంలోకి వెళ్ళాడు. అక్కడి నుంచి భవనం స్పష్టంగా కనిపిస్తున్నది. తలుపులన్నీ మూసి ఉన్నాయి. భవనం కింది భాగంలోని కిటికీ రెక్కలు కూడా మూసి ఉన్నాయి. భవనం పై అంతస్తులోని కిటికీ రెక్కలు కొన్ని తెరిచి ఉన్నాయి. చుట్టుపక్కల ఎక్కడా మనుషుల జాడలేదు. మహేంద్రనాథుడు అక్కడి పరిసరాలను మరొక్కసారి పరిశీలనగా చూసి, యువరాణిని కనుగొనడానికి ఏంచేయడమా అని తీవ్రంగా ఆలోచిస్తూ, మెల్లగా తిరిగి వెళ్ళి ద్వారం దాపులనున్న ఆసనంలో కూర్చున్నాడు. — (ఇంకావుంది)






# అహంకారి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, “రాజా, ఎన్నిసార్లు భంగ పడినా మొక్కవోని నీ పట్టుదలా, కార్య సాధనపట్లగల అకుంఠిత దీక్షా, పొగడ దగి నవే. కాని, అహంకారులూ, అడిన మాట తప్పే మనుషులూ, లోకంలో కోకొల్లలు. ఒక్కొక్కసారి వివేకవంతులూ, దీక్షాదక్షులైన వాళ్ళు కూడా, అలాంటి వాళ్ళ నిర్ణయాలకు తలవంచుతారు. భవిష్యత్తులో నీకు హెచ్చరి కగా వుండేందుకు, అహంకారి అయిన ఒక రాకుమారి గురించీ, ఆత్మాభిమానం కోల్పోయి మందమతిలా ప్రవర్తించిన ఒక రాకుమారుణ్ణి గురించీ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,” అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



విజయపురి రాజు శివసేనుడు మహా పరాక్రమశాలి, ధర్మపాలకుడు. ఆయన భార్య పేరు ఇంద్రావతి. వారికి చాలా కాలానికి ఒక కుమార్తె కలిగింది. వారామెకు సూర్యముఖి అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగారు.

సూర్యముఖికి ఐదేళ్ళ వయసు రాగానే, శివసేనుడు ఆమె విద్యాభ్యాసానికి ఏర్పాట్లు చేశాడు. అయితే, సూర్యముఖికి చదువుల మీద కంటే, యుద్ధవిద్యల మీద ఎక్కువ మక్కువ కలిగింది.

ఏడేళ్ళు నిండేసరికి సూర్యముఖి కత్తి యుద్ధం, అశ్వారోహణం, ఈటె విసరడం వంటి విద్యలలో అపారమైన ప్రావీణ్యం గడించింది. కత్తియుద్ధంలో ఆమె చూపే మెళుకువలు గురువులను సైతం ఆశ్చర్య పరిచేవి.

సూర్యముఖికి పదహారేళ్ళ వయసు రాగానే, రాణి ఇంద్రావతి, కుమార్తె వివాహం చేసి, రాజ్యం అల్లుడికి అప్పగించాలని ఆలోచన చేయసాగింది. అయితే, శివసేనుడు కుమార్తెకు పట్టాభిషేకం జరిపించి, రాజ్యపాలనాభారం అప్పగించిన తర్వాతనే వివాహంచేయాలని భావించాడు.

ఇది గమనించిన సూర్యముఖి తల్లితో, "అమ్మా! నాకు కొంతకాలం పాటు రాజ్య పాలన చేయాలని వున్నది. ఆ తర్వాతనే వివాహం," అని నచ్చచెప్పింది.

ఒక శుభముహూర్తాన శివసేనుడు, సూర్యముఖికి పట్టాభిషేకం జరిపించాడు. పట్టాభిషిక్తురాలవగానే, సూర్యముఖి రాజ్య పాలన మీద దృష్టి కేంద్రీకరించింది. రాజ్యంలో చెదురుమదురుగా జరిగే దొంగ తనాలు అరికట్టింది. నిరుద్యోగులకు చేతి నిండా పని కల్పించింది. వృద్ధులను, వికలాంగులను ఆదుకున్నది.

ఆయన ఒకనాడు కుమార్తెతో, "తల్లీ, కుమారుడు కలగలేదన్న, నా చింత తొల గించావు. ఇకనువ్వు వివాహం చేసుకో వడం, నాకెంతో ఆనందకారణం అవు తుంది," అన్నాడు.

అందుకు సూర్యముఖి, "మీ మాటకు అభ్యంతరం చెప్పను. అయితే, అందరు రాజకుమార్తెల్లా, స్వయంవరంలో నచ్చిన ఏ రాజకుమారుడి మెడలోనో హారం వేయడం నాకిష్టంలేదు. నన్ను కత్తియుద్ధంలో ఓడించిన వారినే వివాహమాడతానని చాటింపు వేయించు," అన్నది.

శివసేనుడు కుమార్తె కోరికకు సంతోషించి అలాగే చేశాడు.

సూర్యముఖి వివాహాన్ని గురించిన చాటింపు సంగతి తెలిసి, ఎందరో రాజకుమారులు సంతోషంతో ఉప్పొంగిపోయారు.



సూర్యముఖిని కత్తియుద్ధంలో ఓడించి, తమ రాణిని చేసుకోవాలని వచ్చిన రాజకుమారులకు, ప్రత్యేకవిశ్రాంతి మందిరాలు ఏర్పరిచారు. రోజు కొకరు చొప్పున సూర్యముఖితో కత్తియుద్ధం చేయడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి.

వారం రోజులు తిరిగే సరికి, వచ్చిన రాజకుమారులకు తాము తలబడబోయేది సామాన్యస్త్రీ కాదని పూర్తిగా తెలిసిపోయింది. సూర్యముఖి చేతిలోని ఖడ్గం మెరుపు వేగంతో తిరుగుతూంటే, ప్రత్యర్థులకు వివాహం సంగతి తర్వాత, అసలు ప్రాణాలు దక్కుతాయా, అన్న కలవరం కలగసాగింది.

వచ్చిన రాజకుమారులలో, ఓడిపోయిన కొందరు సూర్యముఖి దగ్గిర సెలవు తీసుకుని తమ రాజ్యాలు చేరితే, మరికొందరు హడలిపోయి యుద్ధానికి తలపడకుండానే తమ రాజ్యముఖం పట్టారు. ఇంకా కొందరు ఆశచావక ఆమెతో యుద్ధంచేసి ఓడారు.

క్రాంతిపురి రాజ్యం యువరాజు జయంతుడికి కూడా, కత్తియుద్ధం పట్ల ఆసక్తి ఎక్కువ. అయితే అతడు అందరు యువరాజుల్లాగా, సూర్యముఖిని తక్కువ అంచనా వేయలేదు. అతడొక సామాన్యుడిలా మారువేషం వేసుకుని, సూర్యముఖి రాజ్యం చేరి, ఆమె కత్తియుద్ధంలో ఉపయోగించే మెళుకువలను నిశితంగా పరిశీలించ



తనకు తీసిపోని వీరుడని అర్థమైంది. ఆమె అతిగుప్తమైన ఒక మెళుకువను ప్రయోగించి జయంతుడి చేతిలోని కత్తిని ఎగురగొట్టడానికి ప్రయత్నించింది. అయితే, జయంతుడు అతిలాఘవంగా దానిని అడ్డుకుని, మెరుపువేగంతో ఆమె చేతిలోని కత్తిని ఎగురగొట్టాడు. ఇది చూసిన అందరూ హర్షధ్వానాలు చేశారు.

తనను ఓడించిన జయంతుడి వంక ఒకక్షణం నిశితంగా చూసిన సూర్యముఖి, ఒకనాడు తానొక రాజకుమారుడిని ఓడించినప్పుడు ప్రేక్షకుల మధ్యనుంచి చప్పట్లు చరిచిన వ్యక్తే అతడని గుర్తించింది. అతనప్పుడు మారువేషంలో వచ్చి వుంటాడని కూడా ఊహించింది. అప్పుడామెకు జయంతుడు తన మీద ఎలా విజయం సాధించాడో అవగతమయింది.

సాగాడు. సూర్యముఖి గెలిచినప్పుడు, కొన్ని సందర్భాలలో అతడు ఆనందంతో చప్పట్లు కూడా కొట్టాడు. అలాంటి సమయంలో ఒకసారి సూర్యముఖి అతడి కేసి ఒక క్షణ కాలం చూసింది కూడా. సామాన్యుడి వేషంలో వున్న జయంతుడి ముఖంలోని వర్చస్సు, ఆమె దృష్టిని ఆకర్షించింది.

జయంతుడు, సూర్యముఖి ప్రయోగించే మెళుకువలను గమనించి, తన రాజ్యం చేరి, వాటికి ప్రతిక్రియలను సాధన చేసి, తర్వాత విజయపురి చేరి, ఆమెతో కత్తి యుద్ధానికి తలపడ్డాడు.

ఇరువురిమధ్యా పోరు మొదలైంది. ఆమెకు త్వరలోనే, జయంతుడు కూడా

ఆమె, జయంతుడితో, "రాజకుమారా! నన్ను ఓడించినందుకు అభినందనలు. అయితే, మనవివాహం ధర్మసమ్మతం కాదు," అని అతణ్ణి వివాహమాడ నిరాకరించింది.

అది విని జయంతుడు ఒక్కక్షణం నివ్వెరపోయి, "నీవన్నది నిజం! నాకు సెలవిప్పించు," అంటూ సూర్యముఖికి చేతులెత్తి నమస్కారం చేసి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సూర్యముఖి తనను కత్తియుద్ధంలో ఓడించిన వాడిని వివాహమాడతానని ప్రకటించి కూడా, తనను ఓడించిన జయంతుడిని, ఎందుకు నిరాకరించింది? ఇందుకు ఆమెలో గల అహంకారంతో పాటు, అన్న మాట నిలుపుకోవాలన్న నిజాయితీ కూడా లోపించడం కారణంగా కనిపిస్తున్నది. ఇంతకుమించిన అసంబద్ధత ఏమంటే తనను ఓడించినందుకు జయంతుడిని అభినందించడం! ఇక, జయంతుడి సంగతి కొస్తే, అతడిలో ఆత్మాభిమానంవున్న లక్షణం కనిపించకపోగా, పూర్తిగా మందమతి ధోరణి బయటపడుతున్నది. అతడు మాట తప్పిన రాకుమారిపై కోపించక పోగా, నీవన్నది నిజం, అంటూ నమస్కరించి వచ్చిన దారిపట్టడం విచిత్రంగా లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీతలపగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జయంతుడు తక్కిన రాజకుమారులలాగా కాక, మారు వేషంలో వచ్చి, సూర్యముఖి ఖడ్గ ప్రావీణ్యాన్ని పరిశీలించాడు. ఇది గురువు సాహచర్యంలో శిష్యుడు అధ్యయనం చేయడం లాంటిది. ఇందువల్ల, ప్రత్యక్షంగా కాక పోయినా, పరోక్షంగా సూర్యముఖి, జయంతుడికి గురువు అన్నదానిలో సందేహానికి తావులేదు. అందువల్ల వారిమధ్య వివాహం ధర్మసమ్మతం కాదు. ఆ కారణంగానే సూర్యముఖి అతణ్ణి వివాహమాడ తిరస్కరించి, శిష్యుడిగా భావించి అభినందించింది. ఇదిగ్రహించడంవల్లనే జయంతుడు, ఆమెకు నమస్కరించి, సెలవిప్పించమని అడిగాడు. ఈ కారణం వల్ల, సూర్యముఖి అహంకారీ, నిజాయితీ పరురాలు కాదనుకోవడం గానీ, జయంతుడు ఆత్మాభిమానం లేనివాడూ, మందమతీ అనుకోవడం గానీ పొరబాటవుతుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -- (కల్పితం)

[ఆధారం : ఎన్.శివనాగేశ్వరరావు రచన]





# వీరన్న అనుభవం

ఒకనాడు సోమరాజపురం గ్రామకరణం, ఆయన నౌకరు వీరన్న పొలంనుంచి ఇంటికి తిరిగొస్తున్నారు. వాళ్ళు రామాలయం దగ్గిరకు వచ్చేసరికి, ఒక బ్రాహ్మణుడు వాళ్ళకు ఎదురుపడి, కరణంతో, "అయ్యా కరణంగారూ, నమస్కారం! నేనీ ఊరుకు చాలాదూరపు ప్రాంతం వాడిని. కాపుల ఇంట్లో పెళ్ళి చేయించడానికి వచ్చాను. మీ ఇంట్లో ఇంత బస, భోజనం ఏర్పాటు చేస్తే స్థిమితంగా వుండగలను, ఆపై మీదయ!" అన్నాడు.

కరణం ఆ బ్రాహ్మణుడి కేసి ఎగాదిగా చూసి, "మనం తినే ప్రతి గింజమీద, మన పేరు రాసుంటుందిట! మా ఇంట్లో బియ్యం గింజల మీద, దేవుడు మీ పేరు రాశాడులా వుంది. నా ఇంట మీరు భోజనం చేయడం మహద్భాగ్యంగా భావిస్తాను," అన్నాడు సంతోషంగా.

"ధర్మప్రభువులు!" అంటూ బ్రాహ్మణుడు కరణాన్ని పొగిడాడు. తర్వాత ముగ్గురూ కలిసి కరణం ఇంటికి వచ్చారు.

ఆసమయంలో కరణంతో ఏదో పని వుండి, ఆ ఊరి పురోహితుడు కరణంఇంటి అరుగు మీద కూర్చుని వున్నాడు. కరణం వెంటవున్న ఆ బ్రాహ్మణ్ణి చూసి ఆయన విషయం తెలుసుకున్నాడు. ఇద్దరూ మాటలసందర్భంలో తాము దూరపు బంధువులమని గ్రహించారు.

అప్పుడు పురోహితుడు, కరణంతో, "అయ్యా! మీరు వెంటపెట్టుకు వచ్చిన ఈయన, నాకు చుట్టమవుతాడు. చుట్టానికి చూస్తూ చూస్తూ నేను భోజనం పెట్టకుండా, మీ ఇంటిదగ్గర వుండమనడం న్యాయం కాదు. కాబట్టి అన్యథా భావించక, తమరు అనుమతించితే, మా ఇంటికి తీసుకుపోతాను," అన్నాడు.

జె. ఉదయనాగశిరీష

ఇందుకు కరణం సరేనన్నాడు. వాళ్ళు వెళ్ళిపోయారు.

వాళ్ళటు పోగానే వీరన్న, కరణంతో, "అయ్యా! మన గింజల మీద అనుకున్నాం గాని,పురోహితులుగారి బియ్యంమీదకూడా, కొత్త బ్రాహ్మణాయన పేరు రాసుందను కుంటానండి," అన్నాడు, మాటల్లో వినయం వున్నా కాస్త వెటకారంగా.

కరణానికి వాడి వెటకారం అర్థమయింది. ఆయన చిన్నగా నవ్వి, "చూడు వీరన్నా! నేను చెప్పిందాంట్లో అబద్ధం ఏమీ లేదు. ఒక్కొక్కప్పుడు తీరా మనం వడ్డించుకున్న అన్నమే, మనం తినలేం. ఆ మాట కొస్తే--తినే బియ్యంగింజ మీదేకాదు, ఇంకా మనం తినే ప్రతి పదార్థం మీద కూడా మన పేరుంటుంది. ఏమైనా నీకు అనుభవం అయితే తప్ప, సంగతి తెలిసి రాదులే," అన్నాడు.

వీరన్న, కరణం ఇంట్లో ఆపనీ ఈపనీ చేసి, బాగా పొద్దువాలిన తర్వాత ఇంటికి వెళ్ళాడు. వాడు నూతిలోంచి నీళ్ళు తోడుకుని స్నానం చేసి, భార్యను అన్నం వడ్డించమన్నాడు. వాడు వడ్డించిన పళ్ళెం ముందు కూర్చోబోతుండగా, బయటి నుంచి ఎవరో పిలిచారు. విసుక్కుంటూ వాడు బయటికెళ్ళాడు. ఎవరా పిలిచిందన్న కుతూహలం కొద్దీ, వాడి భార్య వాణ్ణనుసరించి వెళ్ళింది.



ఈలోగా వీధి కుక్క ఒకటి, దొడ్డి దారి గుండా ఇంటి లోపలికి వచ్చి, పళ్ళెంలో వున్న అన్నం అంతా క్షణంలో తినేసింది. భర్తకంటే కొంచెం ముందుగా లోపలికి వచ్చిన వీరన్న భార్య అది చూసి బాధతో కుక్కను నానాతిట్లూ తిడుతూ బయటికి తరిమేసింది.

ఇది చూసి వీరన్న ఏమీ తొణక్కుండా, "ఆహా, మన కరణంగారు అన్నట్టే జరిగింది! తినే గింజలమీద, వాళ్ళ వాళ్ళ పేర్లు రాసుంటాయట. ఈ అన్నం వండిన బియ్యం గింజలమీద, కుక్కపేరు రాసున్నదన్నమాట. అయినా ఏం చేస్తాం, మళ్ళీ వండు," అన్నాడు.

ఇది విని వాడి భార్య కోపంగా, "ఈ పెద్ద వాళ్ళు చెప్పే మెట్టవేదాంతం మాటలకేం గానీ, ఇంట్లో బియ్యంగింజ లేదు. ఇప్పటి కిప్పుడు వడ్లు దంచి బియ్యం చేసే ఓపిక నాకు లేదు. ఈ పూటకిన్ని నీళ్ళు తాగి పడు కుందాం," అన్నది.

వీరన్న నిట్టూర్చుతూ, "అయితే, ఇవ్వాళ తిండిగింజల మీద దేవుడు మనపేరు రాయలేదన్నమాట. ఏదో నవ్వులాటకన్నం దుకు, దేవుడు నాకే తిండి లేకుండా చేయడం వింతగా వున్నది. రేపు జరిగింది కరణం గారికి చెప్పాలి," అన్నాడు.

ఇంతలో వీధి వాకిటి ముందు బండి ఆగిన చప్పుడయింది. బండిలోంచి వీరన్న మామగారూ, అత్తగారూ దిగారు. ఇది చూసి వీరన్న గతుక్కుమన్నాడు. ఇప్పుడు అత్త మామలకు వండిపెట్టేందుకు, వడ్లు దంచ డంలో తను భార్యకు సాయపడాలి. ఇది పగలల్లా పొలం పనుల్లో ఒళ్ళు హూనం చేసుకున్న తనవల్ల అయ్యేపని కాదు! వీరన్న మూలుగుతూ అత్తమామల్ని పలకరించి, గోడవారగా వున్న నులకమంచం వాల్చి, దాని మీద పడు కున్నాడు.

ఆ మరుక్షణం వాడి భార్య నవ్వుతూ వచ్చి, "మన వెర్రిగాని, చదువుకున్న వాళ్ళ మాట పొల్లుపోతుందా! కరణంగారన్నది నిజమే. తినే అదృష్టం వుండాలి గాని, వాటి మీద మనపేర్లు రాసుంటే అవి వెతు క్కుంటూ మన దగ్గిరకే వస్తాయి. మా అమ్మా, నాన్న అప్పనపల్లె వెళ్ళారట. అక్కడ దేవుడికి పూజలు చేయించారు. పులిహోర, దద్ధోజనం, చక్రపొంగలి తెచ్చారు. రా, తిందాం!" అని పిలిచింది.

ఇది వినగానే వీరన్నకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. వాడు, ప్రసాదాన్నిభక్తితో తింటూ, "ఎక్కడ పండిన పంటో! ఈ రోజు నీసన్నిధానం నుంచి, వచ్చి నా నోట్లో పడ్డాయి ఈ తిండి గింజలు. తిండి గింజల మీదా, ఇంకా తినే ఇతర వస్తువుల మీదా నువ్వు, వాళ్ళవాళ్ళ పేర్లు రాస్తావని ఒప్పు కుంటున్నాను, మహాప్రభూ!" అంటూ లెంపలేసుకున్నాడు.



# చందమామ

## అనుబంధం - 50




మనదేశపు పక్షులు-జంతువులు:

## అడవిగాడిదలు

బుద్ధిహీనంగా ప్రవర్తించే వాళ్ళను గాడిదలని తిట్టడం, పరిహాసం చేయడం మనకు పరిపాటి. నిజానికి గాడిదలు అంత బుద్ధిహీనమైనవి కావు. అవి గుర్రాల జాతికి చెందినవి. వాటిని పెంచేవాళ్ళ మాటలను, చేతలను గాడిదలు సులభంగా గ్రహిస్తాయి. అయితే, సాధారణంగా మనుషులంటే కాస్త సంకోచం చూపుతాయి!

అడవిగాడిదలు మన దేశానికి మాత్రమే ప్రత్యేకమైనవి. ఇవి గుజరాత్ రాష్ట్రం కచ్- రాన్ ప్రాంతంలో చాలా ఉన్నాయి. దాదాపు వెయ్యి చదరపు మైళ్ళు విస్తరించి వున్న చౌటు బంజరు భూమి రాన్. పూర్వకాలంలో అడవి గాడిదలు ఇక్కడే కాకుండా పర్షియా (ఈనాటి ఇరాన్), సిరియాలలో కూడా నివసించేవి. ఇప్పుడు అక్కడ అవి నశించి పోయాయి.

ఇంచుమించు నాలుగడుగుల ఎత్తు వరకు ఎదిగే ఈ 'ఆసియా అడవి గాడిదలు' బాదంకాయ రంగులో ఉంటాయి. మెడ పైభాగం నుంచి తోక వరకు ముదురు ఊదా రంగు జూలు ఉంటుంది. శరీరం అడుగు భాగం తెల్లగా ఉంటుంది. పొట్టిగా ఉండే మామూలు గాడిదల చెవుల కన్న ఈ అడవిగాడిదల చెవులు చిన్నవిగా ఉంటాయి. కాశ్మీర్ లడక్ ప్రాంతంలో కనిపించే 'టిబెట్ అడవిగాడిదలు' ఎరుపు బూడిద రంగులో ఉంటాయి. అడవిగాడిదలు మనుషులను దూరంనుంచి చూడగానే అతి జాగ్రత్తతో, గంటకు 55 కి.మీ. వేగంతో పరిగెత్తి పారిపోతాయి!





కర్ణాటక ప్రాంతంలో పూర్వాచార పరాయణులయిన బ్రాహ్మణులున్న ఒక అగ్రహారంలో ప్రాణేశాచార్య నివసిస్తున్నాడు. ఆయన వేదపండితుడు; ఆచార సంప్రదాయాలకూ, కఠినమైన నీతినియమాలకూ కట్టుబడినవాడు. పక్షవాతంతో కాళ్ళు పడిపోయిన భార్యకు శ్రద్ధగా పరిచర్యలు చేస్తూ వస్తున్నాడు ప్రాణేశాచార్య.

అదే అగ్రహారంలో నారాయణప్ప అనే మరొక బ్రాహ్మణుడు ఉన్నాడు. వాడు నీతి బాహ్యమైన, సంప్రదాయ విరుద్ధమైన పనులన్నిటినీ చేసేవాడు. మద్యం సేవిస్తూ,

# అనంతమూర్తి 'సంస్కార'



మాంసం తింటూ, పెద్దలంటే ఏ మాత్రం గౌరవమర్యాదలు చూపేవాడుకాదు. వాడికొక అందమైన ప్రియురాలు ఉన్నది. ఆమె పేరు చంద్రి.

నారాయణప్ప హఠాత్తుగా మరణిస్తాడు. చంద్రి ఆ విషయాన్ని ప్రాణేశాచార్యకు తెలియజేసి, అతని అంత్యక్రియలకు ఏర్పాటు చేయమని వేడుకుంటుంది. అయితే, అదొక జటిలమైన నైతిక సమస్యకు దారితీస్తుంది.

నారాయణప్ప నీతి బాహ్యుడు. నీతి నియమాలను పట్టించుకోని వాడి శవాన్ని సంప్రదాయబద్ధులైన బ్రాహ్మణులు ముట్టుకోవచ్చా? వాడికి శాస్త్ర విహితమైన అంత్యక్రియలు జరపవచ్చా? అన్న విషయం వివాదాస్పదమయింది.

చంద్రి తన నగలన్నిటినీ బ్రాహ్మణుల ముందుంచి, భౌతికకాయానికి దహన క్రియలు జరపమంటుంది. అయితే, బ్రాహ్మణులు అందుకు సంకోచిస్తారు. ఈ



సమస్యకు పరిష్కారం ఏమిటా అని సతమతమైపోయిన ప్రాణేశాచార్య, ధర్మ శాస్త్రాలను పరిశోధిస్తాడు. అయినా, అతనికి సరైన మార్గం కనిపించదు. నగలను తీసుకువెళ్ళ మని చంద్రికి చెప్పి, మారుతి మందిరానికి వెళ్ళి తరుణోపాయం సూచించమని భగవంతుణ్ణి ప్రార్థి స్తాడు.కాని ప్రయోజనం కనిపించక ఇంటికి తిరిగి వస్తూ, దారిలో తన కోసం ఎదురు చూస్తూన్న చంద్రిని చూస్తాడు. ఆయనకు ఆమెపై సానుభూతి కలుగుతుంది. ఆయన మీది, భక్తి గౌరవాలతో ఆయన పాదాలకు నమస్కరిస్తుంది చంద్రి. ఆయన ఆమెను ప్రేమతో లేవనెత్తుతాడు. ఆ క్షణంలో ఆయనకు చంద్రిమీద ప్రేమ కలుగుతుంది. అయితే, ఆ సంఘటనకు తరవాత కూడా తాను ధర్మబద్ధుడైన బ్రాహ్మణుడని చెప్పుకోవడానికి తగిన వాడేనా? అన్న అనుమానం ప్రాణేశాచార్యలో కలుగుతుంది.

అక్కడి నుంచి చంద్రి శూద్రుల దగ్గరికి వెళ్ళి, డబ్బు ఇవ్వ చూపి, నారాయణప్ప కాయానికి అంత్యక్రియలు జరపమంటుంది. అయితే వాళ్ళు తాము బ్రాహ్మడి శవాన్ని ముట్టుకుంటే అది అపవిత్రమైపోతుందనీ, దాని కారణంగా తమకు పాపం చుట్టుకుంటుందనీ భయపడి దగ్గరికి రానంటారు.

ఆఖరికి చంద్రి, ఒక ముస్లిం మిత్రుడి సాయంతో దహనక్రియలు పూర్తి చేస్తుంది. కొందరు బ్రాహ్మణులు తామే దహన సంస్కారం జరపవచ్చని తీర్మానించి, అక్కడికి వచ్చే సమయానికి అంతా అయిపోతుంది!

ప్రాణేశాచార్య భార్య చనిపోతుంది. తాను చేసిన అపరాధం నుంచి తప్పించు కోవడానికా అన్నట్టు ఆ అగ్రహారాన్నే వదలిపెట్టి ప్రాణేశాచార్య దేశాటనానికి వెళ్ళిపోతాడు.

1931వ సం॥లో జన్మించిన ప్రముఖ కన్నడ రచయిత యు.ఆర్.అనంతమూర్తి రచించిన సుప్రసిద్ధమైన నవల 'సంస్కార' కథ ఇది. నీతి పేరుతో చెలామణి అవుతున్న మూఢ విశ్వాసాలను ఈ నవల ఎత్తి చూపుతుంది. మనుషుల స్వాభావిక లక్షణాలు ఈ నవలలో వాస్తవికంగా చిత్రించబడ్డాయి. నిజమైన మానసిక పరిపక్వత, చిత్తశుద్ధి ఉంటే తప్ప కేవలం బాహ్యాచారాలు మానవ స్వభావాన్ని మార్చ లేవు అన్న ఉదాత్తమైన సత్యాన్ని ప్రాణేశాచార్య పాత్ర తెలియజేస్తుంది.

# మీకు తెలుసా?

1. దక్షిణ భారతదేశంలో ఒకే ఒక చోట రాతి గుహలో జైన ఆలయం నిర్మించబడి ఉన్నది. అది ఎక్కడ ఉన్నది?
2. 'ఎగిరే పాము' అనే పేరు దానికి ఎలా వచ్చింది?
3. ప్రపంచంలో కెల్లా అతి ఎత్తయిన ప్రదేశంలో పూచే పువ్వు ఏది?
4. 'రెఫ్రిజిరేటర్'ను ఎవరు కనుగొన్నారు?
5. మనదేశంలో ప్రవహించే ఒక నదికి నాలుగు పేర్లు ఉన్నాయి. ఆ నది ఏది? పేర్లు ఏవి?
6. గ్రంథాలయాన్ని నెలకొల్పిన మొట్టమొదటి గ్రీకుదేశస్థుడు ఎవరు?
7. గురునానక్ భక్తి గీతాలు ఆలపించేప్పుడు ఆయన శిష్యుల్లో ఒకడు ఆయన వెంట ఉంటూ 'రబాబ్' వాయించేవాడు. ఆయన పేరేమిటి?
8. మనుషులు సాధారణంగా నిమిషానికి ఎన్నిసార్లు గాలిపీలుస్తారో తెలుసా?
9. వింధ్యకు దక్షిణంగా ఉన్న చాలా ఎత్తయిన కొండ శిఖరం ఏది?
10. గెలుపొందిన వాళ్ళు వెనకకూ, ఓడిపోయిన వాళ్ళు ముందుకూ వెళ్లే ఆట ఏది?

# సమాధానాలు

1. తమిళనాడు రాష్ట్రం, పుదుక్కోట జిల్లా లోని సిత్తన్నవాసల్. దాదాపు 1,400 సంవత్సరాలకు పూర్వం, పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ కాలంలో నిర్మించబడింది.
2. అది శరీరాన్ని రిబ్బనులా పెంచి, ఒక చెట్టుపై నుంచి మరొక చెట్టు మీదికి గాలిలో ఎగిరి దూకడంవల్ల.
3. ఉత్తర ప్రదేశ్, గర్వాల్ పర్వత సానువులలో 6,400 మీటర్ల ఎత్తులో పూచే 'ఎర్మొనియా హిమాలయేసిస్'.
4. జర్మనీలోని మ్యూనీక్‌కు చెందిన కార్లే లిండే - ఫ్రెడరిక్ షిప్పర్. 1870వ సంవత్సరాలలో కనుగొన్నారు.
5. బ్రహ్మపుత్ర. హిమాలయాలలోని మానస సరోవరం తటాకంలో పుట్టి బంగాళాఖాతంలో కలిసే ఈ నదిని టిబెట్‌లో త్సాంగ్ పో అనీ, అరుణాచల్‌ప్రదేశ్‌లో ది బాంగ్, సియాంగ్ అనీ, బంగ్లాదేశ్‌లో మేఘనా అనీ పిలుస్తారు.
6. యూరిపెడిస్ (క్రీ.పూ. 480-406)
7. 'మార్దన' అనే ముస్లిం శిష్యుడు.
8. 15-18 సార్లు.
9. కేరళరాష్ట్రం మలబార్ ప్రాంతం పడమటి కనుమలలోని 'ఆనైముడి' (గజశిఖరం). దీని ఎత్తు 2,700 మీటర్లు.
10. జాడో.



# ఐశ్వర్యపుసంచి

కేశవయ్య, జానకమ్మలకు చంద్రం ఒక్కడే సంతానం. స్వతహాగాతెలివైన వాడైనప్పటికీ, చంద్రం తన సోమరితనం వల్ల, నలుగురిలోనూ చులకన కాసాగాడు. ఇలావుండగా, ఒకసారి జానకమ్మ తమ్ముడు సూరయ్య, అక్కగారిని చూసి పోవడం కోసం వచ్చాడు. తమ్ముడితో కష్టసుఖాలు మాట్లాడుతూ, కొడుకు గురించి కూడా చెప్పుకుని, కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది జానకమ్మ.

సూరయ్యకు మేనల్లుడంటే చాలా అభిమానం. అతడు తన కూతురు పార్వతిని, చంద్రానికిచ్చి పెళ్ళిచెయ్యాలని కూడా ఆశపడుతూండేవాడు. ఆ కారణంగా అతడు వచ్చిన మర్నాడు, చంద్రాన్ని పిలిచి దగ్గిర కూర్చోబెట్టుకునిహితబోధచెయ్యబోయాడు.

అయితే, చంద్రం మొదట్లోనే మేనమామను అడ్డుకుంటూ, "అమ్మా, నాన్నలంటే అభిమానమూ, వారిని సుఖపెట్టాలనే కోరికా నాకులేవనుకుంటే, నువ్వు పొరబాటు పడ్డట్టే, మామయ్యా! కాస్త ఆలస్యమైనా, అనంతైశ్వర్యాన్ని సంపాదించి, అమ్మనూ, నాన్ననూ సుఖపెట్టాలన్నదే నా కోరిక," అన్నాడు.

ఆ మాటలకు ఆశ్చర్యపడుతూనే సూరయ్య, "ఇప్పుడు నీకు డబ్బుకు లోటేమొచ్చింది? నీ తండ్రికున్న ఆస్తికంతకూ నువ్వే వారసుడివి. నాకున్న ఒక్కబిడ్డనూ నీకు కట్టబెట్టి, నాఆస్తికూడా పూచిక పుల్లతో సహా నీకు అప్పచెబుతాను. అదంతా నీకు చాలదా?" అని ప్రశ్నించాడు.

మేనమామ మాటలకు చంద్రం, ఒక్కక్షణం మౌనం వహించి, చివరకు కొద్దిపాటి సంకోచంతోనే, "అసలుసంగతి నీకు ఇప్పుడే చెప్పడం మంచిది, మామయ్యా! పార్వతిని నేనుచేసుకోలేను. మాలతిని చేసుకోవాలని నిర్ణయించుకున్నాను," అన్నాడు.

లక్ష్మీగాయత్రి



మాలతి భూస్వామి రంగరాజు కూతురు. అందానికి అప్సరసగా ఆ ఊళ్ళోనే గాక, చుట్టుపక్కల ఊళ్ళలో కూడా పేరుపడింది. ఈ విషయాలతోబాటు, రంగరాజు కూతుర్ని సామాన్యులకు ఇవ్వడన్న విషయం కూడా అందరికీ తెలుసు.

మాలతి పేరు వింటూనే సూరయ్యతో పాటు చంద్రం తల్లిదండ్రులు కూడా అమితాశ్చర్యం చెందారు. అది గమనించిన చంద్రం నవ్వి, "రంగరాజుగారిని ఒప్పించేందుకే, నేను అనంతైశ్వర్యాన్ని సంపాదించబోయేది! ఆయనే స్వయంగా వచ్చి పిల్లనిచ్చేలా చేయగలను. అదృష్టవంతుణ్ణి ఐశ్వర్యం తేలికగానే వరిస్తుంది. ప్రతి కార్తీక మాసంలోనూ మన ఊరుకు వచ్చే, శివానందస్వామిని దర్శించుకుని, నా అదృష్టాన్ని పరీక్షించుకోదలిచాను," అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

రోజులుగడిచి, చంద్రంఎదురుచూస్తున్న శివానందస్వామిరావడంజరిగింది. చంద్రం ఆయనను కలుసుకుని తన కోర్కె వెల్లడించాడు.

శివానందస్వామినవ్వి, "నేనింకా మరొక వారం పాటు ఇక్కడ వుంటాను. రోజూ నా దగ్గిరకు వస్తూవుండు, చూద్దాం!" అన్నాడు.

వారం గడిచింది. ఆ రోజు ఎప్పటిలాగే చంద్రం వెళ్ళగానే, శివానందస్వామి అతణ్ణి కూర్చోమని చెప్పి, పక్కనే వున్న ఒక తెల్లని సంచి తీసి అతడికిచ్చి, "సంచిలో చెయ్యి పెట్టి చూడు!" అన్నాడు.

చంద్రం ఆశ్చర్యపోతూ, సంచిలోచెయ్యి పెట్టి పైకి తీశాడు. చిత్రంగా అతడి గుప్పెట నిండా బంగారు నాణాలున్నవి.

చంద్రం పరమానందంతో, "స్వామీ! ఒక్క సందేహం. నేను కోరిన ఇన్నాళ్ళకు నా కోర్కెతీర్చారంటే, ఇన్నాళ్ళూ నన్ను పరీక్షించి నా అర్హతను నిర్ణయించారని భావిస్తున్నాను. అవునా, స్వామీ?" అని ప్రశ్నించాడు.

శివానందస్వామి అతడి ప్రశ్నకు నవ్వి, "అలా భావిస్తున్నవాడివి, ఆ అర్హత ఏమిటో కూడా నువ్వే చెప్పు," అన్నాడు.



చంద్రం తడుముకుంటూ, "నా మంచి తనం ఒక అర్హత కాదా, స్వామీ?" అని ప్రశ్నించాడు.

"అంటే–లోకంలో మంచి వాళ్ళందరూ కష్టించకుండా వచ్చే ఐశ్వర్యానికి అర్హులే నంటావా?" అని ఎదురు ప్రశ్నించాడు శివానందస్వామి.

ఈసారి చంద్రం తడుముకోకుండా, "మంచితనానికి తెలివీ, ధైర్యం కూడా వుండాలి. నేను దీని సహాయంతో నా కుటుంబాన్ని సంతోష పెట్టడమే గాక, కల్పవృక్షమూ, కామధేనువూ వున్న విక్ర మార్క మహారాజులాగా, ఎన్నో ప్రజోపయోగ కరమైన కార్యాలు చేస్తాను. బీదలను ఆదుకుంటాను," అన్నాడు.

అందుకు శివానందస్వామినవ్వి, "నువ్వు ఎంత అమాయకుడివో, విక్రమార్కుడితో నిన్ను పోల్చుకోవడంలోనే తెలుస్తున్నది! నీబుద్ధి మాటలద్వారా జ్ఞానార్జన చెయ్యకలి గింది కాదని గ్రహించిన నేను నీకీ సంచి ఇచ్చాను. అనుభవం ద్వారా నీకు పాఠం నేర్పదలచాను. నా ఊహ ప్రకారం నువ్వు పక్షం రోజుల లోపలే, ఈ సంచి నాకు తిరిగి ఇవ్వడానికి తహతహలాడతావు. అప్పటికి నేను ఇక్కడికి యాభై క్రోసుల దూరంలో వున్న శాంతివనంలో వుంటాను. అక్కడికి రా! నీకు శుభం జరుగు గాక!" అని ఆశీర్వదించి అక్కడి నుంచి బయలు దేరాడు.

మర్నాటికల్లా చంద్రానికి లభించిన సిరి గురించి ఊరంతా తెలిసిపోయింది. అతడి స్నేహితుడు కైలాసం, చంద్రాన్ని అభినం దిస్తూ, "ఒరే చంద్రం! వజ్రాలహారం కావా లని, నా భార్య ఏనాటినించో కోరుతున్న సంగతి, నీకు తెలుసుగదా? బడుగుజీవిని; దానికోర్కె తీర్చలేకపోయాను. ఇప్పుడు నీ చెల్లెలి కోర్కె తీరుస్తావో లేదో, అంతా నీ ఇష్టం!" అన్నాడు.

ఈ విధంగా చంద్రాన్ని ఎరిగిన ప్రతి ఒక్కరికీ అవసరాలూ, బాధలూ పుట్టుకు రాసాగాయి. అందరూ తలొక కారణం

చెప్పి, చంద్రాన్ని డబ్బు అడగడం ప్రారంభించారు. క్షణక్షణానికీ అలా అడిగే వారి సంఖ్య పెరగసాగింది.

ఇంత జరుగుతున్నా, తన ఊహప్రకారం రంగరాజుకూతుర్ని యిస్తానని రాకపోవడం, చంద్రాన్ని ఆశ్చర్యపరిచింది. చివరకు అతడే కైలాసాన్నీ, నరసింహం అనే మరొక స్నేహితుణ్ణీ రంగరాజు వద్దకు పంపాడు.

వాళ్ళు తిరిగి వచ్చి చెప్పిన మాటలతో, చంద్రం కళ్ళు ఒక్కసారిగా తెరుచుకున్నాయి. వాళ్ళతో రంగరాజు అన్న మాటలు ఇవి: "నేను నా కూతుర్ని డబ్బుగలవాడికి ఇవ్వాలనుకోలేదు; గొప్పవాడికి ఇవ్వాలనుకున్నాను. మీ స్నేహితుడు ధనవంతుడే గాని, గొప్పవాడు కాదు. వ్యక్తిత్వం ద్వారా గౌరవమర్యాదలూ, భగవంతుడిచ్చిన శారీరక మానసిక శక్తుల ద్వారా ధనసంపాదనా చేసేవాడే గొప్పవాడని, మీ స్నేహితుడికి తెలియజెప్పండి!"

ఆ రోజంతా తెగని ఆలోచనలతో సతమతమయ్యాడు చంద్రం. ఆ రాత్రి అతడిని పదిమందీ తనను డబ్బుకోసం పీక్కుతింటున్నట్టూ, ఇవ్వకపోతే చితకబాదుతున్నట్టూ కల వచ్చింది.

మర్నాడు తెల్లవారు ఝామునే నిద్ర లేచిన చంద్రం, పెరట్లో పనిచేసుకుంటున్న తల్లితో, "అమ్మా! నేను పార్వతిని చేసుకుంటానని, మామయ్యకు కబురు పంపు. నేను శాంతివనం వెళ్ళి, శివానందస్వామి దర్శనం చేసుకుని వస్తాను," అన్నాడు.

జానకమ్మ ఆశ్చర్యంగా, "శాంతివనం వెళ్ళడం దేనికిరా?" అని అడిగింది.

దానికి చంద్రం పెద్దగా నవ్వి, తల చూపిస్తూ, "మనిషికి ఐశ్వర్యంతోబాటు, సుఖశాంతుల్ని కూడా సంపాదించి ఇచ్చే సంచిని, మెదడు అనే పేరుతో భగవంతుడు ఇక్కడ అమర్చే సృష్టించాడన్న సంగతి, నాకిప్పుడే తెలిసింది. ఇక మాయ సంచితో నాకు పనిలేదు. దాన్ని స్వామికి తిరిగి ఇచ్చేసి, నాకు భగవంతుడిచ్చిన అసలైన ఐశ్వర్యపుసంచికి పట్టిన దుమ్ము పూర్తిగా దులిపించుకునివస్తాను!" అన్నాడు.





# చురుకైనపిల్ల

ఒకప్పుడు వజ్రదత్తుడనే రాజు, తన ప్రజల యోగక్షేమాలు కనుక్కుని ప్రజారంజకంగా పరిపాలించటానికి గాను, తరుచు మంత్రి సూక్ష్మబుద్ధితో కలిసి మారువేషంలో తిరుగుతూ ఉండేవాడు.

ఒకనాడు రాజూ, మంత్రీ వర్తకుల దుస్తులు ధరించి వెళుతూ వుండగా, ఒక గ్రామంలో ఒక గుడిసెలో నుంచి విచారకరమైన మాటలు వినిపించాయి. రాజు ఆగి ఆ మాటలు విన్నాడు.

"ఏం చెయ్యాలో నాకు తోచటం లేదు. నా వల్ల ఏమీ కాదు. మీ అమ్మను ఆ ఈశ్వరుడే బతికించాలి!" అని గుడిసెలో ఎవరో అంటున్నారు.

ఈ మాటలు విని జాలిపడి రాజు, మంత్రితో సహా గుడిసె వాకిలి వద్దకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. లోపల ఒక పేద రైతు అరుగుపైన, నెత్తిన చేతులు పెట్టుకుని విచారంగా కూర్చుని ఉన్నాడు. గుంజ నానుకుని నిలబడి అతని కూతురు ఏడుస్తున్నది. పక్కన చాపమీద రైతు భార్య మూలుగుతూ పడుకుని ఉన్నది.

ఎవరో కొత్తవాళ్ళు గడపలో కనబడటం చూసి, రైతు అరుగు మీదినుంచి దిగి నిలబడ్డాడు.

"నీకు వచ్చిన కష్టమేమిటి? సాధ్యమైతే సహాయం చేస్తాను," అన్నాడు మారువేషంలో ఉన్న రాజు.

"అయ్యా, నేను కటికపేదను. నా భార్య జబ్బుతో ఉన్నది. వైద్యం చేయించాలంటే ఇరవై రూకలు కావాలి. ఎవరైనా ధర్మాత్ములు బదులిస్తే ఒక నెల లోపల తీర్చుకుంటాను. కాని ఇచ్చే వారు లేరు. ఎందరినో అడిగి చూశాను. తెగనమ్మటానికీ, తాకట్టు పెట్టటానికీ నా దగ్గిర ఏమీ లేదు," అన్నాడు రైతు.

25-ఏళ్ళనాటి చందమామ కథ



"నీకు కావలసిన ఇరవై రూకలూ నేనిస్తాను. కాని నెల లోపుగా ఎలా తీరుస్తావు?" అని రాజు అడిగాడు.

"కూలిచేసి సంపాదించే దానిలో ఏదో విధంగా కొంత మిగిల్చి ఇస్తాను," అన్నాడు రైతు.

"సరే, ఇరవై రూకలూ తీసుకో," అంటూ రాజు మంత్రికి సైగ చేశాడు. మంత్రి తన వద్ద ఉన్న సంచీలో నుంచి ఇరవై రూకలూ ఎంచి ఇచ్చాడు.

రైతు ఆశ్చర్యంతోనూ, కృతజ్ఞతతోనూ వాటిని తీసుకుంటూ, "తమరెవరో, ఎక్కడుంటారో? ఈ యిచ్చిన దానికి వడ్డీ ఎంత కోరుతారో?" అన్నాడు.

"వడ్డీ అవసరం లేదు. కాని సరిగా నెల రోజులకు బాకీ తీర్చాలి. ఇవాళ శుక్ల చతుర్థి, పై శుక్ల చతుర్థినాడు సాయంకాలం సూర్యాస్తమయ వేళ నగరంలో వినాయకుడి గుడి వద్దకు డబ్బు తీసుకునిరా. మేమక్కడే ఉంటాం," అని చెప్పి రాజు మంత్రితో సహా ముందుకు సాగి వెళ్ళాడు.

భగవంతుడే ఈ మనుషుల రూపంలో వచ్చి తనను ఆపదలో ఆదుకున్నాడనుకుని రైతు సంతోషించి, తన భార్యకు శ్రద్ధగా చికిత్స చేయించాడు. చికిత్స ఫలించి ఆమె కోలుకుని త్వరలోనే మామూలు మనిషి అయింది.

కాని నెల గడువు తీరేసరికి రైతు ఇరవై రూకలు పోగు చెయ్యలేక పోయాడు. కొంచెం కొరత అయింది. తక్కువ డబ్బుతో వారి వద్దకు వెళ్ళటానికి సిగ్గేసి అతను వినాయకుడి గుడి వద్దకు వెళ్ళక, మిగతా డబ్బు కూడా చేరిన తరవాతనే వారి ఎదట పడి, డబ్బిచ్చి క్షమాపణ చెప్పుకుందాం గదా అనుకున్నాడు.

గడువు తీరిన మర్నాడు, శుక్ల పంచమి నాడు, సాయంకాలం వేళ రాజూ, మంత్రీ పూర్వంలాగే మారువేషాలు వేసుకుని రైతు గుడిసె ముందుకు వచ్చి, "ఎవరులోపల?" అని కేకవేశారు.



"నేనేనండీ!" అంటూ రైతు కూతురు లోపలినుంచి వచ్చిన వాళ్ళను చూసి, "కన పడనిది లోపల బాగానే ఉంది. అంతటా వెలుగే, చీకటి ఏమీ లేదు," అన్నది.

రాజుకామె మాటలేమీ అర్థంకాక మంత్రి కేసి చూశాడు. మంత్రి ముఖాన చిరునవ్వు చూస్తే ఆయనకు ఆ పిల్ల మాటలు అర్థమైనట్టు కనబడింది.

"మీ నాన్న ఎక్కడ?" అని మంత్రి ఆ పిల్లనడిగాడు.

"పైకెక్కి సూర్యదేవుడి కన్ను కప్ప బోయాడు," అన్నదామె.

"మీ అమ్మ ఏమయింది?" అని అడి గాడు మంత్రి.

"బావిస్తంభం నీటినుంచి డబ్బు లేరుకు రాబోయింది," అన్నదామె.

"అయితే నువ్వేం చేస్తున్నావు?" అని మంత్రి మళ్లీ అడిగాడు.

"బంగారం నుంచి వెండి తీసి అగ్గిలో పెట్టాను. అన్నీ మోసే మొద్దుకు ముద్దవేసి మెరుగు పెడుతున్నా," అన్నదామె.

"మేం వస్తామని మీ నాన్నకు తెలి యదా?" అన్నాడు మంత్రి.

"తెలుసునండి. పదిమంది, పదిమంది ముందు నోటికి రెండు తక్కువై నందుకు నోరు తెరవటానికి సిగ్గేసి, చెయ్యి చూపి స్తాననీ, మిమ్మల్నింకో పదిసార్లు రెప్ప మూసి తెరవమనీ అన్నాడండి," అన్నదా అమ్మాయి.

"సరే! ఇంతకూ మేమెవరమో నీకు తెలుసునా, అమ్మా?" అని మంత్రి అడి గాడు.

"తెలుసునండీ! మూడు క్షకారాలు!" అంటూ ఆపిల్ల నమస్కారం చేసింది.

"సరే, నీవు పోయి నీ పని చూసుకో!" అని మంత్రి ఆమెతో అని, పోదామన్నట్టుగా రాజుకు సైగ చేశాడు.

రాజూ, మంత్రీతిరిగి వచ్చేటప్పుడు రాజు మంత్రితో; "ఆ పిల్ల అన్నది నాకు ఒక్కటీ అర్థం కాలేదు. నీకేమన్నా తెలిసిందా?" అని అడిగాడు.

"మనని చూడగానే ఆమె తన తల్లి ఆరోగ్యం బాగయిందనీ, తమ కిప్పుడు సుఖంగా ఉన్నదనీ, కష్టాలేమీ లేవనీ చెప్పింది. కనపడనిది అంటే ప్రాణం. వెలుగంటే సుఖం. చీకటి అంటే కష్టం. మీ నాన్న ఏడని అడిగితే పూరిగుడిసెలు కప్పబోయినాడని చెప్పింది. సూర్యుడి కన్ను కప్పటమంటే పూరిగుడిసెల కప్పుల్లో కంతలు మూయటం. అది అతను చేసు కునే వృత్తులలో ఒకటి. వాళ్ళమ్మ విషయం అడిగితే కల్లు అమ్ముకు రాబోయిందని చెప్పింది. బావిస్తంభం నీళ్ళంటే తాటికల్లు. నీరు బావిలో ఉంటుంది. తాటి చెట్టు మీద కూడా నీరుంటుంది. గనక దాన్ని బావి స్తంభం అంటారు. నువ్వేం చేస్తున్నావంటే వడ్లు దంచి బియ్యం చేసి పొయ్యి మీద పెట్టానన్నది. బంగారమంటే వడ్లు, వెండి అంటే బియ్యం. ఆ తరవాత, నేలను మెత్తి అలుకుతున్నానని చెప్పింది. అన్నీ మోసే మొద్దు భూమి. తరవాత వాళ్ళనాన్న నిన్న మన వద్దకు ఎందుకు రాలేదో చెప్పింది. ఇరవైరూకలలో రెండు తక్కువయ్యాయట. ఆమాట చెప్పటానికి సిగ్గేసి, అవి ఇవ్వ గలిగినప్పుడే వద్దామనుకున్నాట్ట. చెయ్యి చూపించటమంటే అదే. మనని పదిపార్లు రెప్పమూసి తెరవమన్నాడు. అంటే, పది రోజులు మనని ఆగమన్నాట్ట!" అన్నాడు మంత్రి.

రాజు యోచించి, "బాగానే ఉన్నది. కాని ఇంతకూ మనమెవరమో దానికి తెలిసిందా? క్షకారాలమన్నదేమిటి?" అన్నాడు.

మంత్రి నవ్వి, "ఆమాట నిజమే కద! మనం రక్షకులం, శిక్షకులం, భక్షకులం! మూడు క్షకారాల మంటే అదే అర్థం," అన్నాడు.

రాజు ఆ పిల్ల తెలివి తేటలను మెచ్చు కుని, మర్నాడే రైతుకు కబురు చేసి దివా ణానికి రప్పించి, "నువ్వు బాకీ తీర్చ నవసరం లేదు. నీకు కొంత డబ్బిస్తాను. మీరంతా సుఖంగా బతకండి," అని చెప్పి, వెయ్యి బంగారు కాసులు అతడికి కానుక ఇచ్చి పంపేశాడు.





హనుమంతుడు సూక్ష్మరూపంలో నిరాటంకంగా పాతాళలంక సింహద్వారం దాటి నగరంలో ప్రవేశించాడు. అతడికి ఒక దిక్కు నుంచి హఠాత్తుగా పెద్ద కోలాహలం వినిపించింది. అతడు తిన్నగా ఆ దిక్కు కేసి వెళ్ళాడు.

ఒకచోట పెద్ద పర్వతగుహను అద్భుత శిల్పంతో కాళికాలయంగా నిర్మించారు. ఆలయప్రాంగణమంతా పూల తోరణాలతోనూ, మణిదీపాల కాంతులతోనూ వెలిగిపోతున్నది. మైరావణుడి సేవకులైన రాక్షసులు మద్యంతో నింపిన కుండలను వరుసలుగా పేరుస్తూ, శివాలెత్తి పాడుతూ, చిందులు తొక్కుతూ పెద్ద కోలాహలం చేస్తున్నారు. .

ఆలయం ముందు డప్పులు, డమరులు, రుంజులు మోగుతున్నవి. రామలక్ష్మణులను తెల్లవారు జామున కాళికి బలి ఇవ్వబోతున్నారని హనుమంతుడు గ్రహించాడు. వెంటనే అతడు బల్లిపిల్లంత అతి సూక్ష్మరూపంతో, మెల్లగా కాళికాలయం గర్భగుడిపైకివెళ్ళాడు. అక్కడ కాళీవిగ్రహం పాదాలు అభిషేకించే ద్రవాలు పోయడానికి ఏర్పాట్లు జరిగి ఉన్నవి. విగ్రహానికి సూటిగా గుండ్రని రంధ్రం ఉన్నది. హనుమంతుడు దానిలో నుంచి గర్భాలయంలోకి దూకాడు.

కాళికావిగ్రహం ఉగ్రస్వరూపంతో చాలా ఎత్తుగా ఉన్నది. హనుమంతుడు విగ్రహం ఎదురుగా నిలడి, "ఓ, మహాకాళీ! నువ్వు,



రామలక్ష్మణులనే బలి కోరుతున్నావా?" అని రౌద్రంగా గర్జించాడు.

ఆ వెంటనే కాళికాదేవి సౌమ్యరూపంతో ప్రత్యక్షమై, "హనుమంతుడా! మైరావణుడి ఆయువు తీరిపోయే కాలం సమీపిస్తున్నది. నీకు జయం కలుగుతుంది," అని ఆశీర్వదించి, అంతర్థానమైంది.

హనుమంతుడు ఆ మాటలకు చాలా సంతోషించి, గర్భగుడి లోపలి తలుపులు బిగించి కాళీవిగ్రహం వెనుకకు చేరి, జరగబోయే దాని కోసం నిరీక్షించసాగాడు.

ఆ సమయంలో మైరావణుడి రాణివాసంలో చాలా సందడిగా ఉన్నది. అక్కడ రామలక్ష్మణుల బలి అనంతరం, చంద్రసేనతో మైరావణుడికి జరగబోయే వివాహం కోసం పెద్ద ఎత్తున సన్నాహాలు సాగుతున్నాయి. రాణివాసం పాలకురాలు కంటకి అనే రాక్షసి. అది చంద్రసేనకు అలంకరణలు చేస్తూ, మధ్య మధ్య ఆమెను బుగ్గ పోట్లు పొడుస్తూ, మైరావణుడి మంత్ర శక్తుల గురించీ, గొప్పదనాన్ని గురించీ తెగ వాగుతున్నది.

భవనప్రాంగణంలో పెద్ద కోలాహలం బయలుదేరింది. రామలక్ష్మణులు ప్రతిమాకారాల నుంచి మామూలు స్వరూపంలోకి మార్చబడ్డారు. వాళ్ళనిద్దరినీ ఒక బండి మీద ఎక్కించి, పొడవాటి కొయ్య కర్రలకు త్రాళ్ళతో గట్టిగా బిగించి కట్టారు. వాళ్ళ శరీరాలు ఎర్రని జపాపుష్పాలతో అలంకరించబడ్డవి. బండిని కాళ్ళుగల భూత సర్పాలు ఈడుస్తున్నవి. రాక్షసులు, రామలక్ష్మణులను పెద్ద ఊరేగింపుతో కాళికాలయానికి తీసుకుపోతున్నారు.

రాక్షసులు పెట్టే కేకలు విని, దానికి కారణం ఏమిటో గ్రహించిన చంద్రసేన చివాలున లేచి, కంటకి వారించే లోపలే భవనప్రాంగణం దాటి, వీధిలోకి పరిగెత్తింది. ఆమె పసుపుబట్టలతో ముఖానికి ఎర్రటి సిందూరం పూయబడిన రాముడు కంటబడగానే గుండెలు అవిసి కూలిపడి మూర్ఛపోయింది.



చంద్రసేనను అనుసరించి వస్తున్న కంటకి, ఇదిచూసి ఎక్కడలేని కోపంతో కొరడా తీసుకుని మూర్ఛలో వున్న చంద్రసేనను ఎడాపెడా కొట్టటం ప్రారంభించింది. కాని ఎంతకూ చంద్రసేనలో చలనం కనబడకపోయేసరికి విసిగి, ఆమెను ఎత్తుకుపోయి భవనంలోని ఒక గదిలో బంధించింది.

కంటకి, కాళికాదేవి పాదతీర్థ ప్రధాన అర్చకురాలు. ఆ పని చూసేందుకామె ఆలయంలోకి పరిగెత్తింది. మైరావణుడు గాని, అహిరావణుడు గాని దేవీపాద తీర్థమని పిలవబడే మద్యాన్ని కంటకి చేతి మీదుగా తాగవలసిందే.

రాక్షసులు, కాళిని మద్యంతో అభిషేకించటం మొదలు పెట్టారు. గుండ్రని రంధ్రంలో నుంచి ధారగా పడుతున్న మద్యాన్ని చూసి హనుమంతుడు అసహ్యించుకుని, గర్భాలయం ఎత్తున దేహాన్ని పెంచి, "ఇక మద్యాన్ని ఆపి, పాలతో అభిషేకించండి!" అని కాళి మాట్లాడుతున్నట్టుగా అరిచాడు.

హనుమంతుడు ఇలా అనగానే దేవాలయం వెలుపల కోలాహలం ఒక్కసారిగా ఆగిపోయింది. కాళి మద్యం వద్దనటం రాక్షసులందరికీ ఆశ్చర్యం కలిగించింది. సోమసూత్రంగుండా, తీర్థకుండంలోంచి పడే మద్యాన్ని తాగేందుకు పానపాత్రలతో రాక్షసులు సిద్ధంగా వున్నారు.

బండిమీద తాళ్ళతో కట్టబడి వున్న రాముడు, లక్ష్మణుడి కేసి చిరునవ్వు నవ్వాడు. కంటకి, మైరావణుడి కేసి దిగాలు పడుతూ చూసింది. మైరావణుడు ఎక్కడ లేని ఆశ్చర్యంతో కళ్ళింత చేసి పక్కనే వున్న అహిరావణుడి కేసి చూశాడు. అహిరావణుడు తలపంకించి, "తమ్ముడా మైరావణా! ఇందులో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు. రామలక్ష్మణులు సాత్విక మూర్తులు గదా! మద్యానికి ఈ సాత్వికాహారం కొరగానిదవుతుంది. అందుకే దేవి పాలు కావాలంటున్నది," అన్నాడు.



"అన్నా, బహుబాగా చెప్పావు. నిత్యం దేవిపాదతీర్థ మద్యాన్ని తాగే నీలాగా, మాకు ఆమె ఆంతర్యం ఎలా తెలుస్తుంది?" అని మైరావణుడు, రాక్షసులను కాళిని పాలతో అభిషేకించమని ఆజ్ఞాపించాడు.

రాక్షసులు పెద్ద పెద్ద పాత్రలతో పాలు తెచ్చి కాళీదేవిని అభిషేకించసాగారు. హనుమంతుడు తీర్థకుండానికి పైగా వున్న రంధ్రం దిగువగా నోరుతెరిచి, ధారగా పడుతున్న పాలన్నిటినీ తాగటం ప్రారంభించాడు. అతడికి ఉత్సాహమూ, బలమూ కలిగాయి.

కొంతసేపటికి అభిషేకం పూర్తయింది. మైరావణుడు ఉత్సాహంగా గర్భగుడి తలుపుల దగ్గరకుపోయి మోకరిల్లి, "కాళీమాతా! నీదర్శనం చేసుకునేందుకు అనుజ్ఞకావాలి," అన్నాడు.

వెంటనే లోపలి నుంచి గంభీర స్వరంలో, "మైరావణా! ముందుగా నీ అన్న అహిరావణుణ్ణి ఫలపుష్ప నైవేద్యాలతో అర్చనకు పంపు," అన్నమాటలు వినిపించినై.

మైరావణుడు తన అన్న దగ్గిరకు వచ్చి, "అన్నా, మాతకు నీవంటేనే ఎక్కువ వాత్సల్యం. ఆమె నిన్ను నైవేద్యాలతో రమ్మని ఆజ్ఞాపిస్తున్నది," అని చెప్పాడు.

అహిరావణుడు పర్వతంలాంటి తన దేహాన్ని అటూ ఇటూ ఊపుతూ, ఫల పుష్పాలూ, ఇంపైన భక్ష్యాలూ, బంగారు పాత్రలో మధువూ తీసుకుని తలుపుల దగ్గరకువెళ్ళాడు. హనుమంతుడు ముందుగానే లోపలిగడియ తీసి వుంచాడు. అహిరావణుడు తలుపులు వెనక్కు నెట్టి లోపల ప్రవేశించగానే, తలుపులు రెండూ చప్పున మూసుకున్నాయి.

అహిరావణుడు తాను తెచ్చిన నైవేద్యాలను దించబోతున్నంతలో హనుమంతుడు అతడి గొంతు వడిసిపట్టుకుని, బలంగా నొక్కి, కిక్కురుమనకుండా అతణ్ణి చంపేశాడు. తరవాత హనుమంతుడు, అహిరావణుడు తెచ్చిన ఫల భక్ష్యాలను తృప్తిగా తిని, బంగారు కలశంలోని మధువును



తాగాడు. ఇప్పుడతడికి మరింత ఉత్సాహో ద్రేకాలు కలిగాయి.

హనుమంతుడు చుట్టూ ఒకమారు కలయచూసి, అహిరావణుడి కళేబరాన్ని గర్భగుడిలోని ఒక చీకటిమూలకు తన్ని, "మైరావణా! ఇప్పుడు రామలక్ష్మణులను లోపలికి పంపు. నా ప్రియతమ భక్తుడు అహిరావణుడు వాళ్ళచేత ముందు నాకు మంత్రయుక్తంగా పూజ చేయించాలి," అని కేక వేసి, తలుపులకున్న గడియను తీసి ఉంచాడు.

మైరావణుడు, రామలక్ష్మణులను గర్భ గుడిలోకి నెట్టాడు. కాళికావిగ్రహం వెనక దాగి వున్న హనుమంతుడు చిన్న గొంతుతో, "రఘువీరుల్లారా! ముందు తలుపులకు లోపల గడిపెట్టి, తయారుగా వుండండి," అన్నాడు కాళి పలుకుతున్నట్టుగా.

ఆ మాటలు విని లక్ష్మణుడు ఆశ్చర్య పోతూ రాముడి కేసి చూశాడు. రాముడు మందహాసంచేసి, "లక్ష్మణా, ఇంకా సంగతి అర్థం కాలేదా? ముందు తలుపులకు గడిపెట్టు," అన్నాడు.

లక్ష్మణుడు తలుపులు బంధించగానే, "ఇక విగ్రహం వెనకకు రండి!" అన్న మాటలు వినిపించాయి.

రామలక్ష్మణులు కాళీవిగ్రహం వెనకకు పోయి, హనుమంతుణ్ణి చూసి పరమా నందం చెందారు. లక్ష్మణుడు ఇంకా దిక్కులు చూస్తూ ఆశ్చర్యంలో వుండటం గమనించి రాముడు, "లక్ష్మణా! కాళీదేవి తనకు మద్యంతో అభిషేకం వద్దన్నప్పుడే గర్భగుడిలో మన హనుమంతుడున్నాడని నేను గ్రహించాను," అన్నాడు.

రాముడిలా చెప్పిన తరవాత లక్ష్మణు డికి సంగతి సందర్భాలు అర్థమయినై. హనుమంతుడు, రామలక్ష్మణులకు కాళీ విగ్రహం ముందు పూజకోసం పెట్టిన సరి కొత్త విల్లులూ, అమ్ములపొదులూ చూపిం చాడు. రామలక్ష్మణులు విల్లంబులు తీసు కున్నారు. హనుమంతుడు తన శరీరాన్ని పెంచి, రామలక్ష్మణులను భుజాల మీద



పడిన సూచనలే కనిపించలేదు. అంటే దాని అర్థం గర్భాలయంలో ఎవరో ప్రమాద కారుడైన శత్రువు చేరాడన్న మాట!

కంటకి ఇలా ఆలోచిస్తూనే కీచు మంటూ పెద్దగా అరిచింది. రాక్షసులు దాని చుట్టూమూగి, "లోపల నీకేం కనబడింది? కాళీమాత నిన్ను బలి కోరిందా?" అని అడిగారు.

ఆ ప్రశ్నకు కంటకి మరింత పెద్దగా అరిచి, "ఓరి, మందమతుల్లారా, మన కళ్ళ ముందే పెద్దమోసం జరిగిపోయింది. మన రహస్యాలను శత్రువులకు చెప్పే మనిషి ఒక్కరే వున్నారు — అది చంద్రసేన. కొర డాతో దాని ఒళ్ళు చితకబాదితే గాని అది నిజం చెప్పదు," అంటూ చంద్రసేన వున్న మందిరం కేసి పరుగులు తీసింది.

ఎక్కించుకుని, విగ్రహం ముందున్న బాణా లన్నిటినీ కట్టగా కట్టిపట్టుకున్నాడు.

గర్భాలయం వెలుపల రాక్షసులు పెద్ద కోలాహలం చేస్తున్నారు. వాళ్ళకు రామ లక్ష్మణుల బలి చూడాలని ఆదుర్దాగా వున్నది. బలికిగాను పెట్టిన ముహూర్తం దాటిపోతున్నది. అయినా గర్భగుడిలో ఉన్న రామలక్ష్మణులను అహిరావణుడు బయ టికి తెచ్చే సూచనలు కనబడలేదు.

గర్భగుడిలో ఏదోమోసం జరిగి వుంటుం దన్న అనుమానం ముందుగా కంటకికి కలిగింది. ఆ రాక్షసి జాగ్రత్తగా తలుపు సందుల్లో నుంచి చూసింది. దానికి ఎక్కడా కాళిని అభిషేకించిన పాలు ఆలయంలో

కంటకి మాటలువిన్న రాక్షసులు దిగాలు పడిపోయి, ఒకరి ముఖాలొకరు చూసుకో సాగారు. ఆ రాక్షసి అనుమానించి నట్టు నిజంగానే గర్భాలయంలో ఎవరైనా శత్రువు చేరాడా? మహాబలుడైన మైరా వణుడు పాలించే పాతాళలంకను చేరగల శత్రువు ఎవరు?

ఇలా ఆలోచిస్తూ రాక్షసుల్లోని కొందరు ధైర్యవంతులు, గర్భాలయద్వారంకేసి నడి చారు. వాళ్ళు తలుపుల మీద చేయి వేసేం తలో, లోపలి నుంచి హనుమంతుడు పెద్ద

సింహనాదం చేసి, ద్వారంకూలేలా కాలితో గట్టిగా తన్ని బయటికి వచ్చాడు.

హనుమంతుణ్ణి చూస్తూనే రాక్షసులు, "మోసం!మోసం!" అంటూ కేకలు పెట్టారు. హనుమంతుడి భుజాల మీద వున్న రామ లక్ష్మణులు, రాక్షసుల మీద బాణవర్షం కురిపించసాగారు. రాక్షసులు హాహాకారాలు చేస్తూ చెల్లాచెదురుగా పారిపోవటం ప్రారంభించారు.

కాళికాలయం ముందు నిలబడి, తన ముఖ్యానుచరులతో మాట్లాడుతున్న మైరావణుడు తలతిప్పి, హనుమంతుడి భుజాల మీద కూర్చుని ఉన్న రామలక్ష్మణులను చూస్తూనే పెద్దగా హుంకరించి ధనుర్బాణాలు తీసుకుని యుద్ధానికి సిద్ధమయ్యాడు.

రామలక్ష్మణులు ఇనుమడించిన ఉత్సాహంతో మైరావణుడి మీద బాణాలు ప్రయోగించారు. ఆ బాణం దెబ్బలు తగిలి మైరావణుడి శరీరం నుంచి కారి కింద పడే ప్రతి రక్తబిందువు నుంచీ ఒక్కొక్క మైరావణుడు పుట్టుకు రాసాగాడు. వాళ్ళు కూడా మైరావణుడిలాగానే హుంకార ధ్వనులు చేస్తూ, రామలక్ష్మణుల మీద బాణ ప్రయోగం చేయసాగారు.

రామలక్ష్మణులు ఇదిచూసి ఆశ్చర్య చకితులై హనుమంతుడితో, "హనుమంతుడా, ఏమిటీ వింత? ఇంతమంది మైరావణులను రక్తపుచుక్క నేల బడకుండా వధించటం ఎలా?" అన్నారు.

ఆ ప్రశ్నతో హనుమంతుడికి సువర్చలా దేవి చెప్పిన చంద్రసేన గుర్తుకు వచ్చింది. హనుమంతుడు ఒకటిరెండు మాటల్లో సంగతి రామలక్ష్మణులకు చెప్పి, ఆకాశంలోకి ఎగిరి, ఒక ఎత్తయిన చోట రామలక్ష్మణులనుదించి, తాను చంద్రసేనవుండే భవనం కేసి పరుగు తీశాడు. రామలక్ష్మణులు, లక్షల సంఖ్యలో పుట్టుకొచ్చిన మైరావణ మూక మీద ఎడా పెడా బాణాలు ప్రయోగిస్తూనే ఉన్నారు.





# రాక్షసమంత్రి

రాజవర్మ అనే రాజుకు చక్రవర్తి కావాలన్న కోరిక పుట్టింది. ఆయన ధర్మచింతనుడనే మంత్రిని పిలిచి యుద్ధసన్నాహాలు చేయ మన్నాడు.

మంత్రి అందుకు ఒప్పుకోక, "మహా ప్రభూ! యుద్ధంవల్ల ధన, మాన, ప్రాణా లకు నష్టం వాటిల్లుతుంది. మన రాజ్యానికి శత్రుభయం పెరుగుతుంది. రాజ్యంలో కరువు కాటకాలు తలెత్తుతాయి. దయచేసి తమరు ప్రశాంత వాతావరణంలో కల్లోలాన్ని సృష్టించే ఆలోచన మానుకోండి," అని చెప్పాడు.

రాజవర్మకు ఈ సలహా నచ్చలేదు. ఆయన ధర్మచింతనుడిని మంత్రిపదవి నుంచి తొలగించాడు. తర్వాత అవకాశ వర్మ అనే దాయాదిని మంత్రిగా నియ మించి, వాడికి చక్రవర్తి కావాలన్న తన కోరికను చెప్పాడు.

అవకాశవర్మ చాలాకాలంగా రాజసింహా సనం మీద కన్నువేసి, అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. కానీ, ధర్మచింత నుడి కారణంగా వాడి ఆటలు సాగడం లేదు. ఇప్పుడు వాడికి తన కోరిక తీరే సమయం దగ్గిరపడిందని తోచింది.

అవకాశవర్మ, రాజవర్మతో, "మహా ప్రభూ! తమ ముఖంలో చక్రవర్తి కళ ఉట్టి పడుతున్నది. అయితే, తమ కాంక్ష నెరవేర డానికి మనకున్న సైనికబలం చాలదు. మన ఇరుగు పొరుగు రాజ్యాలు మనకంటే చాలా బలమైనవి. వాటిని లొంగదీసు కోవా లంటే మనకు దైవానుగ్రహం కూడా వుండాలి. నామాట విని తమరు, మనరాజ్య సరిహద్దులోని ప్రళయపర్వతానికి వెళ్ళి, అక్కడ తపస్సు చేసుకుంటున్న ప్రళయ ముని దీవెనలు పొందిరండి!" అని సలహా ఇచ్చాడు.



ప్రళయపర్వతం మీద ప్రళయుడనే రాక్షసుడు తిరుగుతున్నాడనీ, వాడు మహా క్రూరుడనీ ప్రచారంలో వుండడం వల్ల, ఎవరూ ఆ ప్రాంతానికి వెళ్ళడం లేదు. రాజానుమతి లేకుండా వాడే రాజ్యంలోనూ అడుగు పెట్టకుండా శాపం వున్నదని అందరూ చెప్పుకునేవారు.

అవకాశవర్మ చెప్పింది విన్న రాజు, "నువ్వనే ప్రళయముని గురించి నేను వినలేదు; ప్రళయుడనే రాక్షసుడిని గురించి మాత్రం విన్నాను. అక్కడికి వెళ్ళడం నా ప్రాణాలకే ప్రమాదం కావచ్చు," అన్నాడు.

"మహాప్రభూ! సామాన్యులు తన దరిదాపులకు రాకుండావుండేందుకు, ప్రళయముని చేయించిన తప్పుడు ప్రచారాన్ని మీరు నమ్మకండి. ఆ పర్వతం మీద ఏ రాక్షసుడూ లేడు. ఈ విషయం నాకు ప్రళయముని శిష్యుడు స్వయంగా చెప్పాడు. అయితే, రాజులు కాని వాళ్ళక్కడకు వెళితే, ప్రాణాలతో తిరిగివెళ్ళలేరని కూడా అతడన్నాడు. తమరు ధైర్యం వహించి ప్రళయపర్వతానికి వెళ్ళండి. తప్పక చక్రవర్తి కాగల మహిమను పొంది రాగలరు!" అన్నాడు అవకాశవర్మ.

చక్రవర్తి కావాలంటే ఆమాత్రం సాహసం చేయక తప్పదనుకున్నాడు రాజవర్మ. ఆయన తాత్కాలికంగా పరిపాలనా భారాన్ని అవకాశవర్మకు అప్పగించి, తానొక్కడూ ప్రళయపర్వతానికి బయలుదేరాడు. అవకాశవర్మ రాజ్యం తనచేతచిక్కినట్లే భావించి సంతోషించాడు.

రాజవర్మ కష్టపడి ప్రళయపర్వతం చేరుకుని, ఒక విశాలమైన మర్రిచెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటూండగా ఆయన ముందొక రాక్షసుడు ప్రత్యక్షమయ్యాడు. వాడు వంటినిండా రోమాలతో, ఎర్రటి కనుగుడ్లతో, పిడిబాకుల్లాంటి కోరలతో, మహాకాయంతో ఎంతటి ధైర్యవంతుడికీ భయం పుట్టించేలా వున్నాడు.

అయితే, అవకాశవర్మ అబద్ధాలను నమ్మి వున్న రాజవర్మ, రాక్షసుణ్ణి చూసి




భయపడకుండా, "మునివర్యా! నేనీ సమీప దేశ రాజును. నా పేరు రాజవర్మ. తమరిక విచిత్ర వేషధారణ విడిచి, నాకోరిక తీర్చ ప్రార్థన," అంటూ నమస్కరించాడు.

ఈ మాటలకు రాక్షసుడు ఆశ్చర్యపోయి, రాజువంక ఎగాదిగా చూసి, "రాక్షసుడిలో మునిని చూడగల నీ కళ్ళు చిత్రమైనవి. కానీ, నువ్వు రాజువని తెలిసింది కాబట్టి, ఒక షరతు మీద నిన్ను విడిచి పెడతాను. నన్ను మంత్రిగా చేసుకుని నీ రాజ్యానికి తీసుకు వెళ్ళు. నా సలహా సంప్రతింపులు లేకుండా ఏ పనీ చేయనని మాట ఇవ్వు. లేదా ఇప్పుడే నిన్ను భక్షించి నా కడుపు నింపు కుంటాను. వెంటనే బదులు చెప్పు!" అన్నాడు హుంకరిస్తూ.

రాజవర్మకు ఏంచేయాలో పాలు పోలేదు. వ్యవహారం చూడబోతే రాక్షసుడు నిజం రాక్షసుడే కానీ, మహాముని అనిపిం చడం లేదు. వాడు రాక్షసుడే అయితే తనకు మంత్రి కావడం వల్ల, తన బ్రతుకు దినదినగండంగా వుంటుంది.

ఇలా ఆలోచిస్తున్న రాజును, రాక్షసుడు చేత్తో పట్టుకుని, "త్వరగా నీ అభిప్రాయం చెప్పు! నాకు ఆకలిగా వుంది," అంటూ ఆయనను నోటి దాకా తీసుకు వెళ్ళాడు.

రాజవర్మను, గుహలాంటి వాడి నోరు, కొండచిలువ వంటి వాడి నాలుక భయ పెట్టాయి. ఆయన వెంటనే, "నీవంటి బల వంతుడు మంత్రిగా వుంటే, నాకెంతో మేలు జరుగుతుంది. అయితే, ఈ రూపంలో నిన్నెలా తీసుకు వెళ్ళడమా అని ఆలోచి స్తున్నాను," అన్నాడు.

"కోరిన రూపం ధరించగల శక్తి నాకు ఉన్నది. నేను మానవరూపంలోనే నీకు మంత్రినవుతాను. కానీ నువ్వు, నా చెప్పు చేతల్లో వుంటానని మాటివ్వాలి," అన్నాడు రాక్షసుడు.

రాజవర్మకు ఏదో అనుమానం కలిగి, "నువ్వు, నాకు మంత్రివవడం ఎందుకు? నన్ను చంపి తిని నారాజ్యానికి వెళ్ళి రాజువు కావచ్చుగదా?" అని అడిగాడు.



రాజవర్మ ప్రశ్న వింటూనే రాక్షసుడు కాస్త తడబాటు చెంది, ఏదోరహస్యం చెబుతున్నవాడిలా చిన్న గొంతుతో, "నాకొక శాపం వున్నది! రాజు అనుమతి లేనిదే ఏ రాజ్యంలోనూ అడుగు పెట్టలేను. అందుకే నిన్ను చంపకుండా నీ అనుమతి కోరుతున్నాను. మరి మంత్రి నెందుకు అవుతున్నానంటావా? రాజుకైతే ప్రజాక్షేమం బాధ్యత; మంత్రికి రాజుక్షేమం బాధ్యత. నేను నీ క్షేమం చూసుకోవడం సులభం. ప్రజలక్షేమం చూసుకోవడం కష్టం. రాజు నా చెప్పుచేతల్లో వుంటే, నావల్ల ప్రజలకన్యాయం జరిగినా, ఆ బాధ్యత నీదే కానీ నాది కాదు," అన్నాడు.

అంతావిని, రాజవర్మ ఆలోచనలో పడ్డాడు. ఆయన తన మనసులో, "ఈ రాక్షసుడి శక్తి అపారం. కానీ, వీడివల్ల నాకు లాభమే తప్ప ప్రాణహాని లేదు. ఏదో ఒక రోజున వీడి బలాన్ని ఉపయోగించుకుని, నేను చక్రవర్తిని కావచ్చు!" అనుకుని వాడి మాటలకు తన అంగీకారాన్ని తెలిపాడు.

రాక్షసుడు వెంటనే మానవరూపం ధరించాడు. రాజు, రాక్షసమంత్రి కలిసి రాజధానికి చేరుకున్నారు. ఆ సమయంలో అవకాశవర్మ, రాజవర్మ మరణించినట్లు ప్రకటించి, పట్టాభిషేకం చేయించుకునే ప్రయత్నంలో వున్నాడు. రాజును చూస్తూనే వాడికి నోట మాట రాలేదు. రాజవర్మ వాడి వంక గుడ్లురిమి చూసి, "నీ నేరానికి శిక్ష ఏమిటో తెలుసా?" అంటూ ఏదో అనబోయాడు.

రాక్షసమంత్రి రాజును వారించి, "ప్రభూ! ఈరోజునుంచీ రాజ్యంలో ఏ నేరం జరిగినా, దోషిని నిర్ణయించడం మీ బాధ్యత, శిక్షించడం నాబాధ్యత. ఈ ద్రోహికి నేను విధించే శిక్షను చూడండి!" అంటూ ఒక్కసారిగా తన ఆకారాన్ని పెంచి, అవకాశవర్మను గుప్పెట్లో పట్టుకుని చప్పున నోట్లో వేసుకున్నాడు. ఆ దృశ్యం చూసిన వారందరూ హాహాకారాలు చేశారు.రాక్షసమంత్రి తిరిగి మానవ రూపాన్ని పొందాడు.

రాక్షసమంత్రి చేసిన పని చూసి రాజవర్మ వణికిపోయాడు. ఇలా జరుగుతుందని ఆయన కలలోకూడా అనుకోలేదు. ఆ రోజు నుంచీ ఎంత చిన్న నేరానికైనా సరే దోషిగా నిర్ణయించబడిన వాణ్ణి, రాక్షసమంత్రి ఆహారంగా తీసుకునేవాడు. ఉన్నట్లుండి నేరాలు తగ్గిపోయాయి. ప్రజల మధ్య చిన్న చిన్న తగవులు వస్తే, వారిలో వారే సమాధాన పడడం తప్ప, తీర్పు కోసం రాజు దగ్గిరకు రావడం మానేశారు.

ఇలా కొన్నాళ్ళు జరిగేసరికి రాక్షస మంత్రి రాజవర్మతో, "ప్రజలు నేరాలు చెయ్యకపోతే నాకు ఆహారం దొరకదు. నాకు భయపడి ఎవ్వరూ న్యాయస్థానానికి రావడం లేదు. కాబట్టి మనమే ప్రజల మధ్యకు వెళదాం. నువ్వు దోషిని నిర్ణ యించు, నేను వాడిని తినేస్తూంటాను," అన్నాడు.

ఈ ఏర్పాటు రాజవర్మకు నచ్చలేదు. ఆయన రాక్షసుడితో, "నీకు ఆహారం లభిం చేందుకు, నేనింతకంటే మంచి ఉపాయం ఆలోచించాను. మనం పొరుగురాజ్యం మీదికి యుద్ధానికి వెళదాం. యుద్ధంలో విజయం మనదే అవుతుంది గనక, దొరి కిన శత్రుసైనికులను రోజుకొకణ్ణి చొప్పున హాయిగా సంవత్సరాల తరబడి భుజించ వచ్చు," అన్నాడు.



ఇందుకు రాక్షసుడు సరేనన్నాడు. వెంటనే రాజవర్మ పొరుగు రాజ్యంపై యుద్ధం ప్రకటించాడు. రెండు దేశాల సేనలూ ఒక విశాల మైదానంలో ఒకదాని కొకటి ఎదురు పడ్డాయి. పొరుగు రాజైన ధర్మసేనుడి సైనికబలం అపారంగావున్నది. అయితే, రాజవర్మ సైన్యం మధ్యలో రాక్ష సుడు తాటిచెట్టు ప్రమాణంలో అతి భీక రంగా నిలబడి వున్నాడు! వాణ్ణి చూస్తూనే ధర్మసేనుడి సైనికుల కాళ్ళలో వణుకు పుట్టింది.

అప్పుడు రాజవర్మ, ధర్మసేనుడి నుద్దే శించి, "నాకు సైనిక బలంతోపాటు రాక్షస బలం కూడా వున్నది. యుద్ధానికి తలబడి



సైనికులతో పాటు ప్రాణాలు పోగొట్టుకుం టావో, నాకు సామంతుడివై కప్పం కడతావో నీ యిష్టం!" అన్నాడు.

ధర్మసేనుడు, రాజవర్మకు బదులివ్వ కుండా, సైనికులను వెనక్కు తిరిగిపొమ్మని ఆజ్ఞాపించాడు. పారిపోతున్న ధర్మసేనుణ్ణీ, శత్రుసైనికులనూ చూసి రాజవర్మ వికటా ట్టహాసం చేస్తూ తరమసాగాడు.

ఆ సమయంలో ఎక్కడినుంచో వచ్చిన పాత మంత్రి ధర్మచింతనుడు, రాజవర్మ ముందుకు వెళ్ళి, "ప్రభూ! ఇక ముందుకు వెళ్ళకండి. ధర్మసేనుడియుక్తిని మీరు అర్థం చేసుకోలేక ప్రమాదంలో పడగలరు," అన్నాడు.

"నాకు భయపడి పారిపోతున్న వాడి వల్ల, నాకు ప్రమాదమా? నీకు మతి భ్రమించలేదుకదా!" అన్నాడు రాజవర్మ.

"ఆలోచించండి, ప్రభూ! ఇప్పుడు మనం మనదేశ సరిహద్దుల్లో వున్నాం. ధర్మ సేనుడు తెలివిగా తన సేనలను తన రాజ్యపు సరిహద్దుల్లోకి తీసుకు వెళు తున్నాడు. శాపకారణంగా మీ రాక్షసమంత్రి ఆయన రాజ్యంలో అడుగుపెట్టడానికి ఆయన అనుమతించాలి. అలాకాకుంటే మీ సైన్యం మాత్రమే సరిహద్దులు దాట గలదు. దాన్ని ధర్మసేనుడి సైన్యం ఓడించ గలదు. అప్పుడు మన దేశానికి ధర్మ సేనుడు రాజవుతాడు. రాక్షసమంత్రి ఆయన అనుమతి లేనిదే మన దేశంలో వుండలేడు. నా మాట విని ఇక వెనక్కు తిరగండి," అన్నాడు ధర్మచింతనుడు.

అప్పటికి రాజవర్మకు అసలు విషయం అర్థమయింది. రాక్షసమంత్రి సాయంతో, తను పొరుగు దేశాలపై విజయం సాధించ లేనని తెలియగానే ఆయన దిగులు పడి, "ఇప్పుడు నేనేం చేయాలి? పొరుగుదేశపు సైనికులు పట్టుబడక పోతే, రాక్షసుడు నా ప్రజలను తింటాడు. నేను వీడి పీడ ఎలా వదుల్చుకోవడం?" అని అడిగాడు.

అందుకు ధర్మచింతనుడు, "ప్రభూ! రాజుకు పర రాజ్యాలను జయించాలన్న

వ్యామోహముంటే, అదే రాక్షసులకు బలాన్నిస్తుంది. ప్రజలు నేరాలు చేస్తూంటే, అదే రాక్షసులకు ఆహారాన్నిస్తుంది.. రాక్షస మంత్రి పుణ్యమా అని మనమీ రెండు సత్యాలనూ గ్రహించాం. తమరు రాక్షసుణ్ణి రాజ్యం విడిచి పొమ్మని శాసించండి. అంద రికీ మేలు జరుగుతుంది," అని సలహా ఇచ్చాడు.

రాజవర్మ, రాక్షసుణ్ణి రాజ్యం విడిచి పొమ్మన్నాడు. వాడు ఆగ్రహించి రాజును పట్టుకోబోయాడు. వెంటనే రాజవర్మ సైనిక బలమంతా ఒకటై రాక్షసుడికెదురు తిరి గింది. అంతమంది సైనికులు ఆయు ధాలు పైకెత్తి మీదికి వచ్చేసరికి, అంతపెద్ద రాక్షసుడూ భయపడి ప్రళయపర్వతం కేసి పరుగు తీశాడు.

ఇదిచూసి రాజవర్మ పరమానందం చెంది, ధర్మచింతనుడితో, "మహామంత్రీ! నేను దురాశ కొద్దీ మీకు చాలా అన్యాయం చేశాను. నా దాయాది అవకాశవర్మ మాటలు నమ్మి ప్రళయపర్వతానికి వెళ్ళడం వల్లనే ఈ చిక్కులన్నీ వచ్చాయి. నాకూ రాజ్య ప్రజలకూ కూడా ఘోర ప్రమాదం జరగ నున్న దశలో, మీరు వచ్చి నన్నూ, ప్రజలనూ కాపాడారు, తమకెంతో కృతజ్ఞుణ్ణి! గతాన్ని మరిచిపొండి," అన్నాడు.

ధర్మచింతనుడు, రాజవర్మకు నమస్క రించి, "ప్రభూ! మానవులు తమలోతాము కలహించుకుంటేనే, రాక్షసుల బలానికి విలువ లభిస్తుంది. మానవులంతా ఒక్కటై ఎదురుతిరిగితే, ఎలాంటి రాక్షసుడైనా వెన్ను చూపి పారిపోక తప్పదు. రాజులు సైనిక బలాన్ని రాక్షస వినాశనానికి తప్ప, రాజ్య విస్తరణకుపయోగించకూడదు. ఇకమీదట మీరు చక్రవర్తికావాలన్న ఆకాంక్షను విడిచి పెట్టి, దేశంలో మానవ రూపధారులై వుండి మనుషుల్ని పట్టి పీడిస్తున్న రాక్షసుల్ని గుర్తించి పట్టి నిర్మూలించండి," అన్నాడు.

రాజవర్మ, ధర్మచింతనుణ్ణే తిరిగి మంత్రిగా నియమించి, ఆయన సలహా లతో చక్కగా రాజ్యపాలన చేసి, మంచి పరిపాలకుడుగా కీర్తి గడించాడు.



## చందమామ కబుర్లు

### భూకంపానికి గురైన పిరమిడ్లు

చరిత్రలో మొట్టమొదటిసారిగా ఈజిప్టులోని పిరమిడ్లు భూకంపానికి గురయ్యాయి. ప్రాచీనకాలం నుంచి ప్రపంచవింతలలో ఒకటిగా ప్రసిద్ధిగాంచి అద్భుతమైన కట్టడాలు పిరిమిడ్లు. అక్టోబర్ 19వ తేదీ కైరోను కుదిపిన భూకంపం వల్ల, ఆ నగర సమీపంలోని ఖుఫూ, ఖియోప్స్ పిరమిడ్లు పైభాగం దెబ్బ తిన్నాయి. సక్కారాలోని అతి ప్రాచీనమైన ఆరు అంతస్తుల చెప్రెస్ పిరమిడ్‌లోని కొన్ని రాళ్ళూ కదిలిపోయాయి. ఈజిప్టు వారసత్వాన్ని చాటే ఈ పిరమిడ్లు మరీ దెబ్బతినకుండా చూడడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.



### అత్యధిక వర్షపాతం!

ప్రపంచంలోకెల్లా అత్యధిక వర్షపాతంగల ప్రాంతం ఏదో తెలుసా? మేఘాలయ ప్రాంతంలోని చిరపుంజి అంటారా? కాదు. 1985 వరకు చిరపుంజిలో అత్యధిక వర్షపాతం 11,314మి.మీ.వుండేది. అయితే, ఆ తరవాత హవాయ్‌లోని వైలేల్‌లో అంతకన్నా, ఎక్కువ




వర్షపాతం అంటే 11,438మి.మీ. అని వివరాలవల్ల తెలియవచ్చింది. ఈయేడు చిరపుంజికి 16కి.మీ. దూరంలో ఉన్న మాసిన్‌రామ్‌లో ఈ రెండు ప్రదేశాలనూ మించిన వర్షం అంటే- 11,873 మి.మీ. కురిసింది. మాసిన్‌రామ్‌లో సంవత్సరంలో 150 రోజులు వర్షం కురుస్తూనే ఉంటుంది. ఒక్క రోజులో (1952 జూలై 10) అక్కడ 989.6మి.మీ. వర్షం కురిసింది. ఇంతవరకు మన దేశంలో మరెక్కడా అంత వర్షం కురిసినట్టు దాఖలాలు లేవు!

### 'దూరగ్రహ వాసుల కంఠస్వరం!'

అమెరికాకు చెందిన 'నాసా' (ఎన్.ఏ.ఎస్.ఏ) అనే ఒక అంతరిక్ష పరిశోధనా సంస్థ కాలిఫోర్నియాలోని మొజావ్ఎడారిలో 34 మీటర్ల వెడల్పాటి 'డిష్ యాంటెన్నా'ను ప్రతిష్ఠించింది. దీని ద్వారా, దూరగ్రహవాసుల కంఠస్వరాలు, ఏవైనా వినిపిస్తాయేమోనని పరిశోధనలుజరుపుతున్నారు!





# మహామల్లు!

ఒకప్పుడు కర్ణాటక ప్రాంతంలోని శుంభావతీ నగరాన్ని శంబలుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన ఆస్థానంలో గొప్ప గొప్ప మల్లులూ, వీరులూ ఉండేవారు.

ఒకప్పుడు మహామల్లుడనే గొప్ప వస్తాదు శంబలుని ఆస్థానానికి వచ్చాడు. ఆయన దేశదేశాలలో ఎంతోమంది మల్లులను గెలిచి, ఘనమైన బిరుదులూ, పతకాలూ, సత్కారాలూ పొందిన వాడు. నన్ను ప్రపంచంలో ఎవ్వరూ జయించ లేరు అని చేతికి తోడా వేసుకొన్న మొనగాడు.

మహామల్లు శంబల మహారాజు వద్దకు వెళ్ళి, "మీ ఆస్థానంలో నన్ను గెలిచేవాళ్ళెవరైనా ఉన్నారా? ఉంటే సరే. లేకపోతే, ఓడిపోయినట్టు ఒప్పుకుని, నాకు బిరుదుపత్రం ఇప్పించండి," అని సవాలుచేశాడు.

అందరూ తెల్లబోయారు. ఏమి చెప్పనూ రాజుకు తోచిందికాదు. వెంటనే మంత్రి లేచి రాజుకు ఏదో సైగచేసి, "దీనికేమున్నది ప్రభూ! మన ఆస్థానంలో ఉంటూవుండే 'చండ ప్రచండ దోర్దండ గుండూమల్లు'కు ఈ లోకంలో సాటి ఎవరు? వారు ఇప్పుడు ఊరికి వెళ్ళి ఉన్నారుకదా. ఎల్లుండీ పోటికి రానేవస్తారు. వస్తూనే, ఈ మహామల్లుకు బదులు చెప్పనూ చెబుతారు," అన్నాడు.

వెంటనే మహామల్లుకు సమస్తమర్యాదల తోనూ చక్కటి బస ఏర్పాటు చేయబడింది. మహామల్లు బసలోకూర్చున్నాడే కాని, మంత్రి మాటలు విన్నప్పటినుంచీ అతడి మనస్సు అదోకలాగ మారిపోయింది. పరిచారకులను దగ్గరికి పిలిచి ఆ గుండూమల్లును గురించి భోగట్టాలు అడిగాడు ఆత్రంతో.

అందుకు పరిచారకులు, "ఆయనేనండి ఇక్కడి మల్లులకందరికీ గురువు. వారు యోగసాధనలో ఉంటారు. తగినంత పని కలిగి, ఇక ఆస్థానం పేరు పోతుందేమో అనే

· కర్ణాటక జానపద కథ

సమయం వస్తే తప్ప సామాన్యంగా ఆయన బయటికే రారు," అని చెప్పారు.

మరునాడు, మహామల్లు బసకు సమీపం లోనే ఒక ప్రత్యేక భవనం ఏర్పాటు చేశారు. దానికి ఒక బ్రహ్మాండమైన సింహద్వారం అమర్చారు. ఇది చూసి ఆశ్చర్యపడి, "ఏమిటి?" అని అడిగాడు మహామల్లు.

అందుకు సేవకులు, "ఏమున్నదండి? మా గుండూమల్లుగారు దయచేస్తారు. మామూలుగుమ్మం సరిపోదు వారికి! అందు కనే ఆ సింహద్వారమూ, ఆ భవనమున్నూ," అని బదులు చెప్పారు.

భవనాన్ని సిద్ధం చేసే పనివాళ్లతో మేస్త్రీ, "ఒరేయ్, బాగా గట్టిగా దిమ్మిశ కొట్టండి. మన గుండూమల్లుగారు గనక, అడుగులు వేశారంటే నేల దిగబడిపోయి గోతులు పడుతుంది సుమా. జాగర్త!" అంటూ మాటి మాటికీ హెచ్చరించసాగాడు.

మహామల్లు చూస్తూవుండగానే గంగాళాల నిండా బాదంపప్పులూ, వస్తాదులు తినే పదార్థాలూ వచ్చిపడుతున్నాయి.

ఈ అట్టహాసమంతా కనిపెట్టుతూనే వున్నాడు మహామల్లు. ఆ మరునాడు గుండూ మల్లుగారు ఈ కొత్త భవనంలో దిగుతారన్న వార్త నగరమంతటా మారుమోగింది.

అన్నట్టుగానే, మరుసటి ఉదయానికల్లా ఇరవై ఎనిమిది గుర్రాలు లాగేటటువంటి ఒక చిత్రమైన పెద్దబండి వచ్చి భవనం వాకిట నిలిచింది. ఆ తరవాత మంత్రి ఏర్పాటు చేసిన ప్రకారం పరివారమంతా, "చండప్రచండ దోర్దండ గుండూమల్లుగారికీ జై!" అంటూ పెద్దగా ఘోష పెట్టారు. మల్లుగారికి స్వాగతమివ్వటానికని మహారాజు గారు స్వయంగా ఆ బండి వద్దకు వచ్చారు.

ఇంతలో ఒక భటుడు, రాజుగారి వెంట వున్న మంత్రి దగ్గరకు వచ్చి, "అయ్యా, మహామల్లుడు బసలో లేడు! ఎటో వెళ్ళినట్టు కాపలావాళ్ళు చెబుతున్నారు!" అన్నాడు.

అప్పుడు మంత్రి చిన్నగానవ్వి, రాజుతో, "మహారాజా! మన పథకం పారింది. ఆ మహామల్లు, ఈసరికి మన రాజ్య సరిహద్దులు దాటుతూ ఉంటాడు!" అన్నాడు.



## ప్రకృతి వింతలు

### పరస్పర సహకారం

జంతువులు తమ మీద వాలే ఈగలనూ, కీటకాలనూ తరుముకోవడానికి తమ తోకలను ఉపయోగిస్తాయి. అయితే, ఎంత పొడవాటి తోక అయినప్పటికీ అది శరీరంలోని అన్ని భాగాలకూ అందదుకదా! అలాంటప్పుడు ఒక జంతువు మరొక జంతువు పక్కన నిలబడి, ఒక దానితోకతో మరొక దాని శరీరం మీది ఈగలను హాయిగా తోలుకుంటూ ఉంటాయి.



### నిద్రించే మొక్కలు!

ఉదయం నిద్ర లేచి, రాత్రి పడుకునే మనుషుల్లాగానే — కొన్ని మొక్కలు రాత్రులలో నిద్రపోతాయి. అటువంటి మొక్కల పువ్వులు పగటి పూట వికసించి, రాత్రిపూట ముడుచుకుపోతాయి. అయితే, ఆ మొక్కలకు రాత్రి పూట వెలుతురూ, పగటిపూట చీకటీ ఏర్పాటు చేసినట్టయితే ఆ వెలుతురులో వికసించడం, చీకటిలో ముడుచుకుపోవడం జరుగుతుంది!



### సుదీర్ఘ జీవితం

జీవరాశులన్నిటిలో మనుషులే ఎక్కువ కాలం జీవిస్తారు. అయితే, మనుషుల కన్నా ఎక్కువ కాలం జీవించే ప్రాణులు కూడా కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు సముద్రపు రత్న భోగి (సీ అనెమోని) సముద్రపు నాచు (స్పాంజ్) శతాబ్దాల తరబడి ప్రాణాలతో ఉంటాయి. వాటి శరీరంలో చనిపోయే జీవకణాలు మళ్ళీ పుట్టుకు రావడమే వీటి చిరాయుకు కారణం.



'మంచి పిల్లవాడివి కదా, ఫ్లాపీ
స్నానానికి రా మరి"



మీ బిడ్డ, 'ఫ్లాపీ' బొమ్మ

మీ బిడ్డను, ఫ్లాపీని మీరు విడదీయలేరు



పాండా

చందమామ కలెక్షన్‌నుంచి బోలెడు రకరకాల చక్కని, మెత్తటి ముద్దులైన ఆటబొమ్మలు. ప్రతి బొమ్మ ఎంతో ప్రత్యేకమైనది!

మీ బిడ్డ ఏళ్ళ తరబడి ఎంతో మమకారంతో ఒక్క క్షణం కూడా వదలకుండా ఆడుకొనేలా ఎంతో ప్రత్యేకంగా చందమామ కలెక్షన్‌లో ప్రతి ఆటబొమ్మను తయారుచేయడం జరిగింది.



బౌ-వౌ

- ఏ వయస్సు పిల్లలకైనా - ఎంతో సురక్షితమైనది
- అత్యంత శ్రేష్ఠమైన సింథటిక్ ఫైబర్‌తో తయారుచేయడంవల్ల యివి దీర్ఘకాలం మన్నుతాయి.
- వీటిని శుభ్రంగా నీళ్ళతో కడగవచ్చు వెడిపోవు, వంకరపోవు.

అంతేకాదు, మీ పిల్లలు సంబరపడే విధంగా ఓ అందమైన కానుక!

మీరు కొనుగోలుచేసే ప్రతి చందమామ సాఫ్ట్ టాయ్‌తో మీ దుకాణందారుని



జంబో

**ఉచిత గిఫ్ట్ కూపన్**

అడగండి. దానిని పూర్తిచేసి, యిచ్చిన చిరునామాకు పోస్టుచేయండి. అనేక గంటల తరబడి మీ పిల్లలకు వినోదం కలిగించే కానుకల్ని మేము పోస్టులో పంపుతాం

ఇప్పుడే కొనండి - ఈ సదవకాశం పరిమిత కాలం వరకే.

అన్ని ముఖ్యమైన షాపులలోనూ లభ్యమవుతాయి.



స్పోర్టి




# CHANDAMAMA
## COLLECTION

ARTIG/CT/1138

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



V. Muthuraman



Subhash G. Shenoy

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పండిస్తాడు బంగారం, చూడు !

రెండవ ఫోటో : శ్రమలేనిదే దొరకదు, కూడు !

పంపిన వారు : పి. రాజవర్ధన్ S/O ప్రకాశ్‌రావు,

బూసారెడ్డి గూడా, సికిందరాబాదు - 500 003 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి ।

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 105.00 ఎయిర్‌మెయిల్ ద్వారా : రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా : 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026